అమ్మకము

ఎలక్ట్రిక్ మోటారులు, ఎలక్ట్రిక్ స్విచ్చిలు, ఆయిల్ ఇంజనులు, ..., బులక్ నెయిల్సు పరసమైన ధరలకు దొరకును. వివరములకు:
యునైటెడ్ ఇండియా ట్రేడింగ్ కంపెనీ,
20, కేశవఅయ్యర్‌వీధి, మద్రాసు 3.
టెలిగ్రాం: "SWITCHES" MADRAS.


# ఆంధ్రపత్రిక


The Andhra Patrika, Madras, } Regd No. 1118, Vol. 34 No 138 THURSDAY 11th SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao


# "దేశంలో నేటి మతకలహ పరిస్థితి యుద్ధంతో సమానంగా వున్నది"

## యుద్ధాన్ని ఎదుర్కొన్నట్లే ఎదుర్కోంటామని ప్రధాని నెహ్రూ హెచ్చరిక

### సైనిక బలప్రయోగంతో నిమిత్తంలేకుండా ప్రజలు శాంతిస్థాపనకు తోడ్పడాలని విజ్ఞప్తి



న్యూఢిల్లీ, సెప్టెంబరు 9: "యుద్ధంతో సమానమైన పరిస్థితినే మన మిప్పు డెదుర్కొంటున్నాం. అందుచేత అర్థాత్తూ యుద్ధంలో వ్యవహరించినట్లే ప్రభుత్వ మీ కల్లోలాలను అణచివేసి దుర్మార్గులను అరికట్టి విజయాన్ని సాధిస్తుంది. ఈ మతకలహాలను అణచివేయడంలో ఇకమీద ఎంతమాత్రమూ బిగువు సడలడం ఉండదు." అని భారతప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ మతకలహాలను గూర్చి రేడియోలో ప్రసంగిస్తూ ఉద్ఘాటించాడు.

సైనికాధికారులూ, పోలీసులూ కూడా దుర్మార్గులు చెలరేగుతుంటే వారిని శిక్షించడానికి పూనుకోక, కేవలం ప్రేక్షకులుగా మాత్రమే ఉంటున్నారనీ, పక్షపాత బుద్ధితో వ్యవహరిస్తున్నారనీ తనకు ఫిర్యాదులు వచ్చాయనికూడా ప్రధాని అన్నాడు.

"ఒకవ్యక్తికి బాధ్యతగల పదవిలో ఉన్నప్పుడు ఈవిధిని తాను నిర్వహించక పోయినట్లయితే అతడు పదవిలో ఉండడానికి వీల్లేదు. విధి నిర్లక్ష్యానికి ఫలితంగా విధించబడే శిక్షను అతడు అనుభవించితీరాలి. ఇప్పుడు మనం ఎదుర్కొంటున్న పరిస్థితి అనేక మానవప్రాణాలకు హానికల్గించేదే మాత్రమే కాక ఏ భారతజాతిని మనం ప్రేమిస్తున్నామో, ఏజాతి ఔన్నత్యం కోసం ఇన్నాళ్లుగా మనం కష్టపడి సేవచేశామో ఆ మహాజాతి అమూల్యప్రాణానికే అపాయకరమైనది. కాబట్టి ఈ కలహాలను మాన్పడంలో మన పట్టుదల ఎంతమాత్రమూ దుర్బలం కావడానికి వీల్లేదు. తరతరాలుగా శ్రమించి సాధించిన మహాఫలాన్ని దుష్టశక్తులుగాని దుర్బుద్ధిగల ప్రజలుగాని నాశనం చేస్తూవుంటే ఊరికే చూస్తూ ఊరుకోవడం అసాధ్యమైన విషయం."

ఢిల్లీ పరిస్థితి చాలా తీవ్రమైందని చెప్పి పండిట్ నెహ్రూ ప్రజాసహకారాన్ని అర్థిస్తూ ఇల్లా అన్నాడు.

"సైనికబలంతో ఢిల్లీ అశాంతిని అణచగలగడంలో నా కెంతమాత్రమూ సందేహం లేదు. పరిస్థితిని అదుపులో పెట్టగల అవకాశం ఇంతవరకూ తప్పిపోలేదు. ఇప్పటికే సైనికబలాలు అశాంతిని ఇంచుమించు అణచివేశాయి. త్వరలోనే పూర్తిగా అణచివెయ్యగలవు. ఈ విషయంలో నాకేమీ సందేహం లేదు. కాని ఏమాత్రమూ ఆత్మనిగ్రహం లేకుండా కేవలం మిలిటరీ సహాయంతోనే ఇండియాలో మనం బ్రతకబోవడం లేదు. ఎన్నాళ్లని సైనిక సహా


3 వ పేజీ చూడుడు


## ఢిల్లీలో శాంతపరిస్థితి

ఢిల్లీ, సెప్టెంబర్ 9: నిన్న రాత్రి నుంచి ఈ వుదయం 10 గంటలవరకూ ఢిల్లీ నగరంలో ప్రధాన సంఘటనలేవీ జరగలేదని అధికారరీత్యా తెలుస్తున్నది. ఈ వుదయం నగరంలో పర్యటనచేసిన ప్రధాన సేనాని, నగరమంతా ప్రశాంతంగావున్నదని ఇండియాప్రభుత్వపు ఎమర్జన్సీ కమిటీకి నివేదించెను.

### విమానాల గస్తీ

కాన్పేటప్పుడు వెనకాముందూ చూసవద్దని సైనికులకు, గవర్నర్ జనరల్ అంగరక్షకులకూ ఇచ్చిన ఆజ్ఞను వారు నిన్న అక్షరాలా పాటించారు. అందుకని పరిస్థితి చాలా అదుపులోకి వచ్చింది. 'స్పిట్‌ఫైర్' విమానదళం ఒకటి నగరంమీదా, పరిసరాలమీదా గస్తీతిరుగుతున్నది. అదనపు సైనికదళాలు వచ్చినవి. క్రిందటిరాత్రి చాలా ప్రాంతాల్లో పోలీసు వాలంటీర్లు గస్తీ తిరిగారు.

ఈ వేళ ఉదయం 11-30 వరకూ ఒక్కడే గాయపడ్డాడు.

### ఎమర్జన్సీ కమిటీ నిర్ణయం

ఇండియా మంత్రివర్గపు ఎమర్జన్సీకమిటీ ఈ వేళ సమావేశమై మిలిటరీ, పోలీసు, పరిపాలనా శాఖలనుండీ, స్వఛ్ఛంద సేవక సంఘాలనుండీ ప్రతినిధులతో శాంతిభద్రతలను కాపాడేందుకు ఒక కమిటీని నియమించాలని నిర్ణయించారు. ఈ కమిటీని ఢిల్లీకమిటీ అంటారు.

### రైళ్లు నడవటం లేదు

ఢిల్లీకివచ్చేవి, అక్కడనుంచి వెళ్లేవి రైళ్లు ఏవీ ఇంకా నడవటంలేదు. బి. బి. అండ్ సి. ఐ. రైల్వేమీటరుగేజి బళ్లుకూడా నడవటంలేదు. ఢిల్లీ, మధురస్టేషనల మధ్య కల్లోలాలు జరుగుతుండటంవల్ల వచ్చే రైళ్లన్నీ మధుర దగ్గరనే ఆగిపోతున్నవని తెలుస్తున్నది.

ఏవిధమైన ఆయుధాన్ని కానీ, ఏ సైజులో వున్న కృపాణాన్ని (సిక్కుల ఆయుధం) కానీ ఒకవారంరోజులవరకూ ఎవరూ ధరించకూడదని డిల్లా మేజిస్ట్రేటు ఈ వేళ ఉత్తరువు చేశాడు.

### సిమ్లాలో అశాంతి

8 వ తేదీ మధ్యాహ్నం సిమ్లా లోయర్ బజారులో ఒకడు తుపాకిదెబ్బతిన్నాడు. లక్కర్ బజారులో ఒకడు కత్తిపోటుతో చనిపోయినాడు. సైనికులు గస్తీ తిరుగుతున్నారు.

## రేషన్ దుకాణదారుకు నెహ్రూ మందలింపు

ఢిల్లీ, సెప్టెంబరు 9: ఢిల్లీలో అందరు సామాన్య పౌరులవలెనే ఇండియా ప్రధాని నెహ్రూకూడా ఈ వేళ రేషనుకు ఇబ్బంది పడవలసి వచ్చింది.

హేస్టింగ్సు రోడ్డులో వున్న రేషన్ షాపులో ఆయన నౌకరు మిగిలిన అందరితోనూ వరసలో చాలాసేపు నిలబడ్డప్పుడు రేషన్‌పదార్థాల సప్లయి రానందువల్ల రేషన్ ఇవ్వనని దుకాణదారు అన్నాడు. అప్పుడతడు వెళ్లి ప్రధానిని అక్కడకు తీసుకుని వచ్చాడు. ఉన్ననిలవలోనే అందరికీ రేషన్లుఇవ్వవలసినదని వాదించగా, దుకాణదారు రేషన్ ఇచ్చాడు.

### గవర్నర్‌జనరల్‌తో గాంధీజీసమావేశం

ఢిల్లీ, సెప్టెంబర్ 9: గాంధిమహాత్ముడు ఈ సాయంత్రం గవర్నర్ జనరల్ లార్డ్ మౌంట్ బాటన్‌ను కలుసుకుని కొంతసేపు సంభాషించిరి.

ప్రధాని పండిత నెహ్రూ ఈ వేళమధ్యాహ్నం ఢిల్లీకి దగ్గరలోవున్న సోనేపట్టుకు వెళ్లిరి. కల్లోలాలు జరిగిన ... వార్తలు వచ్చినవి.

## "జాతీయ విప్లవ కార్యక్రమ సఫలతకు ఐక్యత అవసరం"

### కూమింటాంగ్ సభ్యులకు చాంగ్‌కైషేక్ విజ్ఞప్తి



నాన్కింగ్, సెప్టెంబరు 9: "మన ప్రబలశత్రువులగు కమ్యూనిస్టులను నాశనంచేసి, జాతీయ విప్లవ కార్యక్రమం ముగించుటకు మనం ఐక్యతతో పనిచేయవలె"నని జనరలిజ్మో చాంగ్-కై-షేకు కూమింగ్‌టాంగ్ పక్షం 4 వ సమావేశంలో ఉపన్యసించెను.

తాను ప్రధాన కార్యకర్తయగు కూమింగుటాంగు పక్షము యొక్కయు, తాను నాయకుడగు సాన్‌మిన్‌ఛి యువజనపక్షం యొక్కయు సంయుక్త సమావేశంలో ఉపన్యసిస్తూ, "కూమింగుటాంగుచరిత్రలో అతిక్లిష్టమైన ఈ సమయమున ఈ రెండుసంస్థలు ఐక్యమై, బలవత్తరమై కృషిచేయాల"ని జనరలిజ్మో చాంగు-కై-షేకు అనెను.

గతసంవత్సరం కమ్యూనిస్టులు తమ సైన్యమును వృద్ధిపరచుకొన్నారని చెపుతూ, కమ్యూనిజం వ్యాప్తి ప్రజాభీష్టమునకు వ్యతిరేకము కాబట్టి వారికి దేశంలో తావుండరాదని ఈయన అన్నాడు. క్యూమింగుటాంగు సభ్యులలో అవినీతి, నైతిక దుస్థితిని, నశించిపోతున్న ఉత్సాహమును విమర్శిస్తూ వానివలన తన నాయకత్వం అప్రదిష్టపాలై పోతున్నదనీ, చైనా జాతీయ పితామహుడు డా. సన్‌యాట్‌సేన్ ఆదేశములను తాను పూర్తిచేయలేకపోతున్నానని జనరలిస్మో చాంగు-కై-షేక్ విచారపడెను.

త్వరలో ఎన్నికలుజరిపి చట్టబద్ధ ప్రజాస్వామిక పరిపాలనద్వారా అధికారం ప్రజల హస్తగతంచేసి తీరవలసిందేనని వీరుచెప్పిరి.

ఆర్గురు కొమింగ్‌టాంగ్ సభ్యులు, అయిదుగురు యువజన సంఘ సభ్యులు, మొత్తం 11 మందిని తన కార్యవర్గ సభ్యులుగా ఈయన ఎన్నుకున్నారు. ఈ సమావేశం అతి రహస్యంగా జరుగుచున్నది. ఈసమావేశం ఇంకొక 5 రోజులపాటు జరుగునని తెలుస్తున్నది. పార్టీ ప్రధాన కార్యదర్శి జనరల్ మాట్‌ఛెన్, రాజకీయ పరిస్థితిని గురించి ప్రధాని జనరల్ చాంగ్‌ఛున్, సైనిక వ్యవహారములను గురించి రక్షణశాఖమంత్రి జనరల్ పాయ్‌ఛంగ్ షి గారలు ఈ సమావేశంలో ఉపన్యసించిరి.

### ఇండొనీసియాకు చైనా యుద్ధఓడలు?

షాంఘై, సెప్టెంబర్ 9: ఇండొనీసియాలోని చైనాప్రజల రక్షణకొరకుయుద్ధనౌకలను, విమానములనుఅచ్చటికిపంపుటకు నిశ్చయించినట్లున్నూ, జపాను సామ్రాజ్యము తిరిగి తలయెత్తకుండ అణచుటకు చైనా రష్యాతో సంపూర్ణముగా సహకరించగలదనీ, ప్రధానిజనరల్ ఛాంగ్‌ఛున్ తన ఉపన్యాసంలో చెప్పినట్లు తెలుస్తున్నది.

### కొరియా విషయమై ఐక్యరాజ్యసమితి చర్చిస్తుందా?

లండన్, సెప్టెంబరు 9: కొరియా స్వాతంత్ర్యం విషయమై అమెరికా చేసిన సూచనలను రష్యా తిరస్కరించటం వలన అమెరికా ఈవిషయంఅంతర్జాతీయ సమితి సర్వసభ్య సమావేశమునకు దాఖలుచేయవచ్చునని భావిస్తున్నారు.

## అంతర్జాతీయ సంస్థ సైనిక బలం

### 12 దళాలు వుండవలెనని రష్యా ప్రతిపాదన

లేక్‌సక్సెస్, సెప్టెంబరు 9: ఐక్యరాజ్యసమితి నియమించ దలుచుకున్న అంతర్జాతీయ పోలీసుదళం ఈ క్రింది విధంగా ఉండాలని సమితి సైనిక సంఘంలో రష్యా ప్రతినిధివర్గం అధికారరీత్యాతెలియజేసింది. ఈ పోలీసు దళంలో 12 సైనిక దళాలు, 1200 విమానాలు, అయిదో ఆరో క్రూయిజర్లు వుండాలని రష్యా ప్రతిపాదించింది. ఈ ప్రతిపాదన బ్రిటన్ చైనాల ప్రతిపాదనలతో సరిపోతున్నది. కాని బ్రిటన్ ఈ పోలీసు దళానికి భారీయుద్ధనౌకలూ,విమానవాహక నౌకలూకూడ వుండాలని ప్రతిపాదించింది.

### కొచిన్ చైనా ప్రభుత్వ రాజీనామా

పారిస్, సెప్టెంబరు 9: ఇండోచైనాలో ఏడాదినుంచీ స్వపరిపాలన కలిగివున్న కొచిన్‌చైనా రిపబ్లిక్ మంత్రివర్గం రాజీనామా ఇచ్చిందని ఒక ఫ్రెంచి వార్తాసంస్థ ద్వారా తెలుస్తున్నది. ప్రస్తుతం పారిస్‌లో వున్న ఒక 'ఇండోచైనా నాయకుడు' అధ్వర్యంకింద నూతన ప్రభుత్వాన్ని ఏర్పరుస్తారు. ఈ 'నాయకుడు' త్వరలో సైగాన్‌కు వెళుతున్నాడు.

ఈ కొచిన్ చైనాప్రాంతం వియత్‌నామ్‌లోనిదని వియత్‌నామీస్ వాదిస్తున్నారు.

### మార్షల్ స్టాలిన్

మాస్కో, సెప్టెంబరు 9: యాల్టాలో ఉన్న రష్యన్ నల్లసముద్రపు నౌకాదళానికి చెందిన 'మాలటోఫ్' అనే క్రూయిజర్‌ను ఆగస్టు 19 వ తేదీన అకస్మాత్తుగా వచ్చి పరిశీలించాడని 'ప్రావ్‌దా' ప్రకటించింది.

### టర్కీ ప్రధాని రాజీనామా

లండన్, సెప్టెంబరు 9: ఆరోగ్య కారణాలవలన టర్కీ ప్రధాని రెసెప్ పెకర్ తన పదవికి రాజీనామా నిచ్చినట్లు అంకారా రేడియో ప్రకటించింది.

## 'చావో, బ్రతుకో తేల్చుకోవలెననే పాత సిద్ధాంత ఆవశ్యకత ఏర్పడినదని గాంధిజీ ఉద్ఘాటన



న్యూఢిల్లీ, సెప్టెంబరు 9: ఈ రోజు ఉదయము గాంధీమహాత్ముడు న్యూఢిల్లీ చేరెను. ఆయన ఒక ప్రకటన చేసెను. భారతదేశ రాజధాని నగరములో "చావో బ్రతుకో తేల్చుకోవలెననే నాపాతసిద్ధాంతము నేను అనుసరించవలసి ఉందనిన్నీ, మతిలేకుండా సాగిస్తూవున్న ఖూనీలు, ఇండ్లను తగలపెట్టడాలు, దోపిడులు ఆపివేయడానికి అందరూ పూనుకోవలెననీ గాంధీజీ చెప్పెను.

"తా నొకటి తలచిన దైవమొకటి తలచును" అనే సూక్తి యథార్థమని నా ఈ జీవితములో అనేకపర్యాయములు తెలుసుకొన్నాను. ఇకనుతున్నా ఈ సత్యమును గ్రహించుతుంటారు. ఆదివారము నాడు కలకత్తానుంచి బయలుదేరి వచ్చినప్పుడు డిల్లీ నగరము ఇంత విషాదావస్థలో ఉందని నాకేమీ తెలియదు. ఢిల్లీ జేరినాను. ఢిల్లీవిషాదఘటనలనుగురించి ఈ రోజు రోజుఅంతా విన్నాను. ఢిల్లీనగరము విషాదావస్థలో ఉంది. అనేకమంది ముస్లిము మిత్రులను చూచినాను. వారందరూ హృదయవిదారక విషయాలు చెప్పినారు. ఢిల్లీనగరము యథాస్థితికి వచ్చేటంతవరకున్నూ ఢిల్లీ నగరము వదలిపెట్టి నేను పంజాబుపోరాదని, ఈ దారుణఘటనలు నాకు మందలింపులు అయినవి.

ఈ సంక్షుభిత వాతావరణము చల్లబడి ప్రశాంతము అయ్యేటందుకు నాచేతనయిన కొంచెము నేను చేయవలెను. "చావో బ్రతుకో" తేల్చుకోవలెననే నాపాతసిద్ధాంతాన్ని భారతదేశరాజధానీ నగరములో నేను అనుసరించవలసిఉంది. ఇప్పుడు మతిలేకుండా సాగుతూవున్న సర్వనాశకర కార్యాన్ని ఢిల్లీ వాస్తవ్యులు ఎవరున్నూ క్షమించవములేదు. ఇందుకు నేను సంతోషిస్తున్నాను. దైవోపహతులు అయి పశ్చిమ పంజాబునుంచి వచ్చిన కాందిశీకుల కోపోద్రేకాన్ని నేను అర్థము చేసుకోగలను. అయితే కోపము అనేది సూక్ష్మరూపములో ఉండే చిత్తభ్రమణం. ఆచిత్తభ్రమణమువల్ల ఇంకా చెడు జరుగుతుంది. ప్రతీకారం రోగశమనము కాజాలదు. అసలు వ్యాధిని అది మరింత ముదర పెడుతుంది. అందువల్ల ఇప్పుడు మతిచెడి ఖూనీచేస్తూ ఇండ్లు తగలపెడుతూ దోపిడులుచేస్తూ ఉన్న వారి వద్దకు అపతులు చేయడం మానివేయవలసిందని నేను కోరుతున్నాను.

కేంద్రప్రభుత్వములో సామర్థ్యము ఉంది; ధైర్యవంతముఅయింది. స్వార్థత్యాగులయినవారే యూనియన్ ప్రభుత్వములో ఉన్నారు. భారత స్వాతంత్ర్య ప్రకటనము అయి వారు అధికార నిర్వహణములోకి వచ్చి ఇంకా ఒకమాసముఅయినా కాలేదు. వారు ఇల్లు చక్క బెట్టుకోడానికి అయినా వారికి అవకాశమియ్యకపోవడము గొప్ప నేరము. అది ఆత్మహత్య సదృశము కాగలదు. ఆహార పదార్థాలు తరుగుగా ఉన్నవనే విషయము నాకు సంపూర్ణముగా తెలుసును. మూకలు చెలరేగడముతో ఆహార పదార్థాల సరఫరా కరవైపోతున్నది. ఎవరికి ఆహార పదార్థాలు అందకేయడమున్నూ అసంభవమైపోతున్నది. ఢిల్లీ నగరములో ఈ ఉన్మాదాన్ని తొలగించి ప్రశాంత పరిస్థితులను భగవంతుడు కలగజేస్తాడని నేను నమ్ముతున్నాను.

నేను బయలుదేరి వచ్చేటప్పుడు కలకత్తా వారు నాకు చేసిన వాగ్దానాలను చెల్లిస్తారని నేను ఆశపడుతున్నాను. వారు అట్లా చేస్తేనే నేను ఈ ఉన్మాద ఉద్రిక్త వాతావరణములో నిలవ గలుగుతాను."

## భద్రతాసంఘంలో ఈజిప్టు ఫిర్యాదు

న్యూయార్కు, సెప్టెంబరు 9: ఈజిప్టు విషయమై భద్రతా మండలిలో చర్చలు రేపటితో పూర్తియగునని ఆశిస్తున్నారు ఉభయ పక్షములు తిరిగి సమాలోచనలు జరుపుకొనవలెనని భద్రతామండలి సూచించబోతున్నట్లు తెలుస్తున్నది. ఈ సూచన జరగకుండ చేయుటకు ఈజిప్టు ప్రతినిధులు శాయశక్తులా కృషిచేస్తున్నారు. బ్రిటిషు సైన్యములను వెంటనే ఈజిప్టునుండి తరలించవలసిందని నిర్ణయం జరిగించవలెనని వారు పట్టుదలతో పనిచేస్తున్నారు. ఈవిధమైన తీర్మానం చైనాచే ప్రతిపాదించవలెనని వారు ఆలోచిస్తున్నారు. కాని ఈ సూచన భద్రతామండలిలో సగమని చైనా గ్రహించినది. చైనా రేపు ప్రవేశపెట్టనున్న తీర్మానం ఏవిధంగా వుండవలెనో యింకా నిర్ణయం కాలేదు. రష్యా, పోలెండు రాజ్యాలు రెండూ వెంటనే బ్రిటీషు సేనల ఉపసంహారణ జరుగవలెనని వాదిస్తున్నవి. కాబట్టి ఈ తీర్మానం ఆ రాజ్యాలు ప్రతిపాదించటం సమంజసం. అమెరికాలో కూడా చాలమంది ఈజిప్టు పక్షం వహించి, అక్కడ ప్రాబల్యం ఏర్పరచుకోవాలనివాదిస్తున్నా, అమెరికా తనకు తానై ఒక తీర్మానం ప్రతిపాదించబోవటంలేదు. మొత్తంమీద అమెరికా బ్రిటన్‌కే మద్దతుచేస్తుంది (గ్లోబ్)



నబ్బులో మితిమీరిన నురుగు చెప్పినట్లు అధిక పరిశుభ్రత చేకూరదు.

హమాం & 501 సబ్బులు

మీకు నాణ్యమైన ... క్రమముగాను, చౌకగా ...

ది టాటా ఆయిల్ మిల్స్ కం|| లి||





## గంటల పంచాంగం

సర్వజిత్ సం॥ని. శ్రావణ బ॥ ఏకా॥ 1947 సం॥ సెప్టెంబరు 11 గురువారం శు॥ ఏకాదశి ప 1 6 పున ఈ 7-43 పుష్య తె 5-30 వర్జ్యం ప 2-58 ల 4-25 వ.

బ॥ ద్వాద॥ సెప్టెంబరు 12 శుక్రవారం శు॥ ద్వాదశి ప 10 3 ఆశ్లే ఈ 3-9 వర్జ్యం పా 5-3 ల 6-30 వ.

# ఆంధ్రపత్రిక

సర్వజిత్ సం॥ సు. శ్రావణ బ॥ ఏకా॥

గురువారము

## కొన్ని అనుమానములు

ఆంధ్రరాష్ట్ర నిర్మాణము గురించి రాష్ట్రీయ మహాసభ తీర్మానము సరిహద్దుసంఘ నియామక విషయమున, విస్పష్టమైన విధానమును సూచించలేదని కొందరి అభిప్రాయము. అదీ కాక అనుమానములను కూడ కలుగచేయుచున్నది. దీనికి ఆధారము లేకపోలేదు. విషయ నిర్ణయ సభ చేసిన తీర్మానము; విశాఖ, ఉభయగోదావరులు, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, మద్రాసు; చిత్తూరు, కడప, కర్నూలు. అనంతపురంజిల్లాలను, బళ్లారిలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గ తాలూకాలను కలిపి వెంటనే ఆంధ్రరాష్ట్రమును ఆర్డరు ఇన్ కౌన్సిలు ద్వారా ఏర్పరచవలసినదని కోరినది. మద్రాసును తమిళులుకూడ తమదనుటవల్ల దానిని సర్ బి. ఎన్. రావుగారి పథకములో సూచించినట్లుగ ఉభయప్రాంతముగ పరిగణించవలెనని ప్రథమమున కార్యవర్గ తీర్మానము కోరినది. తరువాత విషయనిర్ణయసభ చర్చ ఫలితముగా సరిహద్దు నిర్ణయసంఘ నిర్ణయము తేలు వరకు మద్రాసు ప్రస్తుతమునకు ఉభయప్రాంతముగ పరిగణింపబడి దాని పరిపాలనము సర్ బి. ఎన్. రావుగారి ప్రణాళికలో తెలుపబడిన విధముగా ఏర్పాటు కావలెనని తీర్మానము చేయబడినది. ఈ అంశము, ఒరిస్సారాష్ట్రములోనున్న గంజాం, కోరాపుట్టి జిల్లాలు మొదలైన ఆంధ్ర ప్రాంతములు చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటు, సేలంజిల్లాలలోని కొన్ని ప్రాంతములు ఆంధ్రరాష్ట్రములో చేరవలెననుఅంశము కలిపి కేంద్ర ప్రభుత్వమునకు సూచించుచూ ఆ విషయమున తీర్పునిచ్చుటకు సరిహద్దు సంఘమును వెంటనే ఏర్పరుపవలెనని ప్రత్యేకతీర్మానము చేసినది. మహాసభలో ఆమోదింపబడిన తీర్మానము కార్యవర్గము సూచించిన మొదటి రెండు భాగములతో కూడినదో, లేక మూడుభాగములతో కూడినదో విస్పష్టము కావలసియున్నది. విషయ నిర్ణయ సభలో ప్రముఖుల ప్రసంగములనుబట్టి కార్యవర్గము సూచించిన రెండుభాగములు కల తీర్మానము ఆమోదింపబడినట్లు ఊహించవలసియున్నది. మద్రాసు, ఒరిస్సాలోని ఆంధ్రప్రాంతములు, చెంగల్పట్టు ఉత్తర ఆర్కాటు, సేలంజిల్లాల లోని కొన్ని ప్రాంతములు ఆంధ్ర జిల్లాలలో చేరవలెననునది సరిహద్దుసంఘ తీర్పునకు వదలుచున్నది నేరు తీర్మానముగా అంగీకరింపబడినట్లు అనుకొనవలసి వచ్చుచున్నది.

తీర్మానము ఏ రూపమున నున్నను, ప్రథమములో అనుకొన్నంత అంత చాకచక్యముగ లేదు. కార్యవర్గ ముసాయిదా మద్రాసును ఉభయప్రాంతముగ చేయవలెననినది. విషయనిర్ణయ సభ తీర్మానము ఉభయ ప్రాంతముగ ఏర్పాటు చేసి, హక్కు విషయము, ఒరిస్సాలోని ఆంధ్రప్రాంతములు, చెంగల్పట్టు, ఉత్తరఆర్కాటు, సేలంజిల్లాలలో కొన్ని భాగములతో బాటు (మద్రాసు విషయమునకూడ) సరిహద్దు నిర్ణయసంఘ తీర్పుకు వదలి వేసినట్లు తీర్మానంలో మూడవ భాగాన్ని ప్రత్యేకతీర్మానంగా చేయుటవల్ల వ్యక్తమగుచున్నది. మహాసభలో ఆమోదింపబడిన తీర్మానం మదరాసు ఉభయ ప్రాంతంగా ఏర్పడి "దాని పరిపాలన తాత్కాలికముగా, సర్. బి. ఎన్. రావుపథకము ననుసరించి" ఏర్పరచవలెనని సూచించుటవలన పైని వ్యాఖ్యానమునకు బలమేర్పడుచున్నది. ఉభయప్రాంతముగ చేయవలెననుటే గాక, పరిపాలన విషయమున సర్ బి. ఎన్. రావు శాశ్వతముగా చూపెట్టిన పద్ధతిని తాత్కాలికముగ అంగీకరించమనుటవల్ల, మద్రాసు మాది అను వాదమునకు బలముపోవుటలేదా? సగము హక్కును మనము వదలుకొనిన మిగిలిన సగముహక్కును సరిహద్దు సంఘము ఊడగొట్టగలదు. తమిళులు మద్రాసు పూర్తిగ తమ దనుచున్నారు. మనము సగముహక్కును అపుడే వదలుకొన్నట్లు మహాసభ తీర్మానము తెలిపినది: మద్రాసు విషయమున సరిహద్దు సంఘముతో నిమిత్తములేక ఉభయప్రాంతంగా చేయవలెననిన అదివేరు. విషయ నిర్ణయసభలో మద్రాసునుగూర్చిన సవరణ చర్చ సందర్భమున, "మద్రాసునుగూర్చి తేలేవరకు రాష్ట్రం వద్దని భావన ఉంటే దానిని అంగీకరించము"ని రంగాగారనుట, ఈ సందర్భమున గమనించుట అవసరము. శ్రీ రాజగోపాలాచారి గారి మంత్రిత్వకాలములో రాష్ట్ర శాసనసభ తీర్మానము ననుసరించి రాష్ట్రసిద్ధి కాకపోవుటకు, అపుడు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారి అధ్యక్షతను బులుసు సాంబమూర్తిగారి ప్రోత్సాహమున ఆంధ్ర మహాసభ మద్రాసును గురించిన తీర్మానము, నిరోధకమైనదను సంగతి ప్రస్తుతవైఖరికి కారణమేమో తెలియదు. అందువల్లనే ఈ తీర్మానం దూరదృష్టితో చేయబడినదని సాంబమూర్తిగారనుటకు కారణమై యుండవచ్చును.

ఇవన్నీ ఎటులున్నప్పటికీ రాష్ట్రనిర్మాణమునకు చేయుమనిన ఆర్డర్ ఇన్ కౌన్సిలుతోనే, (అనగా అదేకాలమున) సరిహద్దుసంఘమునుఏర్పరచవలెనని కోరియుండవలసినది. తీర్మానము ఈ విషయమున అనందిగ్ధతను వెల్లడించుచున్నది: దానిలో వెంటనే(Forthwith) సరిహద్దు నిర్ణయసంఘమును నియమించవలెనని అన్నప్పటికీ, విషయనిర్ణయ సభలో రంగాగారి తదితరుల ప్రసంగములను బట్టి రాష్ట్రనిర్మాణానంతరమే నియమింపబడుట అని తేలుచున్నది. పరిషత్తుద్వారా రాష్ట్రనిర్మాణం జరిగిన దీర్ఘకాలయాపన జరుగునని సాంబమూర్తి గారనిరి. కావచ్చును. అప్పటిదాకా ఒరిస్సా ఆంధ్రప్రాంతములు; తదితరములు యథాస్థితిని ఉండవలెనన్నమాట. కాబట్టి రాష్ట్రనిర్మాణముతో బాటు సరిహద్దు నిర్ణయసంఘమును నియమింపవలెనని కోరుట యుక్తము అవసరము. ఇంతకు మహాసభ తీర్మాన ధోరణికి మూలకులు శ్రీ ప్రకాశంపంతులు గారికి తదితర ఆంధ్రనాయకులకు సర్దార్ పటేల్, పండిత నెహ్రూ వ్యక్తిగతముగా ఇచ్చిన వాగ్దానములు. రాజ్యాంగపరిషత్తు ఏ ప్రాంతములు నూతన రాష్ట్రములుగా నిర్మించవచ్చును అని నిర్ణయించుటకు ఒకసంఘము ఏర్పాటు కావలసియున్నది సరిహద్దునిర్ణయ సంఘమును ఏర్పరచవలసియున్నది. మిగిలిన భాషాప్రాంతముల కోరికలను త్రోసివేసి ఈ సంఘములను కాదని, ఒక్క ఆంధ్రరాష్ట్రమును మాత్రము నిర్మించుటకు కేంద్రప్రభుత్వము సిద్ధపడిన గర్వింపవలసిన విషయము.

## ఇండొనీసియా సమస్య
### మార్షల్‌తో వాన్‌మూక్ సమాలోచన

వాషింగ్టన్, సెప్టెంబర్ 8: ఇండొనీసియా డచ్చి లెఫ్టినెంట్ గవర్నర్ జనరల్ వాన్‌మూక్ అమెరికా విదేశాంగమంత్రి జార్జి మార్షల్‌ను ఈరాత్రి కలుసుకుని, ఇండొనీసియా సమస్యమీద గంటన్నరసేపు చర్చించాడు. సహాయ విదేశమంత్రి లావుట్ కూడా ఈ సంభాషణల్లో పాల్గొన్నాడు.

సంభాషణ అంతా ముగించిన తరవాత ఇక్కడు పరిస్థితి అంతా అవగాహనతోయుందనుకుంటాను" అని అతడు అన్నాడు.

ఇండొనీసియా పోరాటాన్ని ముగించేందుకు నేనేమీ కొత్త సూచన చేయలేదు. ఐక్యరాజ్యసమితి చేసేందుకు అవకాశం కనపడుతున్న ఒక ప్రతిపాదనను గురించి నేను చర్చించాము." అని వాన్‌మూక్ ప్రకటించాడు.

### సరిహద్దుల గజిబిజి

బటేవియా, సెప్టెంబర్ 9: యుద్ధవిరమణ ఒడంబడిక ఏ విధంగా ఆచరింపబడుచున్నదోనని ఐక్యరాజ్యసమితి తరఫున పరిశీలిస్తున్న ఆస్ట్రేలియా, ఫ్రెంచి కాన్సల్‌లు, తూర్పు జావా రంగంలో గతవారం పర్యటించారు. డచ్చి రిపబ్లికన్ ప్రాంతాల సరిహద్దులు అన్నీ గజిబిజిగా ఉన్నవనీ, ఇరుపక్షాల సైన్యాలూ ఒకేప్రాంతాల్లో ఉంటున్నవనీ ప్రకటించినట్లు తెలుస్తున్నది. ఈ మధ్యరిపబ్లికన్, కేంద్రకార్యాలయానికి వెళ్లేటందుకు వీరు డచ్చి ఆక్రమితపట్టణాల్లో నుంచి వెళ్లవలసివచ్చింది. చాలాప్రాంతాల్లో ఇదే విధమైన పరిస్థితులే వుండవచ్చునని వారు అన్నారు.

గొంబోంగ్‌కు దక్షిణంగా ప్రబలింగ్, పేకింగ్‌లనుంచి డచ్చిసైన్యాలు తూర్పు దిక్కుగా దాడిచేయగా రిపబ్లికన్లు తరిమివేశారని రిపబ్లికన్‌వార్త ఈరాత్రి ప్రకటించింది. దీనిలో 30 మంది డచ్చివారు నష్టపడ్డారు.

రిపబ్లికన్లు ప్రేరేపించిన గొరిల్లాలు జరిపిన దాడులవల్ల ఆగష్టు 4 వతేదీనుండి ఇప్పటివరకూ 105 గురు డచ్చిసైనికులు మరణించారనీ, 8 మంది కనపించుటంలేదనీ, 214 మంది గాయపడ్డారనీ డచ్చి సైనికవార్త ఈ వేళ ప్రకటించింది

## ఆటంశక్తి కంట్రోల్
### నివేదిక తయారైంది

లేక్‌సక్సెస్, సెప్టెంబరు 9: ఐక్యరాజ్యసమితి ప్రత్యేక కమిషన్ ఆటంశక్తి కంట్రోల్‌పై సర్వసభ్య సమావేశమునకు పంపవలసిన నివేదికను తయారుచేసినది. ఈ నివేదికలోని నిబంధనల నన్నింటికీ రష్యా వ్యతిరేకముగానే వోటుచేసెను. కాని తక్కిన 10 మంది సభ్యులు అంగీకరించుటవలన ఈ నివేదిక అంగీకరింపబడినది. అంతర్జాతీయ ఆటంశక్తి కంట్రోల్ సంఘ నియామకమును గురించి ఈ నివేదిక సిఫార్సుచేసింది. ఇటువంటి సంఘం ఏర్పడకముందు ఆటం ఆయుధములను బహిష్కరించుటకు అంగీకారం కుదరవలెనని రష్యా కోరుచున్నది.

## జర్మనీకి సిక్కు నాయకుల ప్రయాణం

లండన్, సెప్టెంబరు 9: సిక్కుల హక్కులనుగురించి ప్రచారం చేయుటకు వచ్చిన సిక్కునాయకులు ఆచార్య గంగాసింగ్, మాస్టర్ ఖడ్గ సింగ్ ధూపియా గారలు 15 రోజులు జర్మనీలోని బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి ఆక్రమిత భాగములను పర్యటించి వచ్చుటకు వెళ్ళిరి.

## ఎగుమతుల అభివృద్ధి
### బ్రిటిష్ మంత్రివర్గ సమావేశంలో చర్చ

లండన్, సెప్టెంబరు 9: ఈరోజు బ్రిటిషు మంత్రివర్గం అత్యవసరంగా సమావేశమై, నూటికి 40 వంతుల చొప్పున ఎగుమతుల వృద్ధిచేయటానికి వాణిజ్యశాఖ మంత్రి సర్ స్టాఫర్డు క్రిప్సు అనుసరించ దలంచుచున్న విధానమును పరిశీలించెను.

ఇందుకొరకై నాల్గు విధముల కార్యక్రమమును సర్ స్టాఫర్డు క్రిప్సు సూచించెను: 1. ఎగుమతిచేయదగు వస్తువుల అధికోత్పత్తి, 2. ఆయా పరిశ్రమలలో ఉత్పత్తి చేయగల్గిన మొత్తముల అంచనా, 3. కొత్త పెట్టుబడి విధానములపై కంట్రోల్, 4. కార్మికులను ఎంతవరకు ఒక పరిశ్రమనుండి మరొక పరిశ్రమకు మార్పు చేయవలెను. ఈ విషయములపై వివరములకు శుక్రవారం నాడు యజమానుల, కార్మికుల ప్రతినిధుల సభలో సర్ స్టాఫర్డు క్రిప్సు తెలియజేయును.

బొగ్గుశాఖ మంత్రి ఎమాన్యుయల్ షిన్వెల్ యార్క్‌షైర్ బొగ్గుగని కార్మికుల సమ్మెపరిస్థితిని వివరించి చెప్పెను. ఈ విషయముపై యిప్పట్లో మంత్రివర్గం జోక్యం కలుగజేసుకొనవలసిన అవసరములేదని భావిస్తున్నారు.

### లార్డ్సు సభ

లండన్, సెప్టెంబరు 9: దేశంలోని ఆర్థిక పరిస్థితిని గురించి ప్రభువులసభలో ఒక ప్రాత్రి ప్రకటనచేయుటకు ప్రభుత్వం నిరాకరించింది. ప్రజలచే ఎన్నుకొనబడినది, అతి ముఖ్యమైనదియగు కామన్సుసభ సమావేశంలో లేనప్పుడు, ఆసభలో చేయదగిన ప్రకటనను ప్రభువులసభలో ప్రకటించటం చట్టవిరుద్ధమని ప్రభుత్వపక్షనాయకుడు లార్డ్ ప్రభు పునరుద్ఘాటించెను. ప్రతికూలపక్షనాయకుడు సాలిస్‌బరీప్రభువు మాట్లాడుతూ, ప్రభుత్వమునకిచ్చిన అధికారములు దుర్వినియోగపరచు నని తాము భయపడితిమనీ, వాస్తవముగా ప్రభుత్వం ఏ ముఖ్యమైన త్రోవ ఉయ్యలేదనీ, చట్టబద్ధమో కాదో ఆలోచింపకయే దేశపరిస్థితిని చక్కబరచుటకు ప్రజలు ప్రభుత్వమునకు సహాయపడుదురనియు చెప్పెను. ప్రభుత్వం ఏ ప్రకటన చేయకపోవటంవలన, చర్చకు అవకాశం లేకపోయింది. అవసరమైతే కామన్సుసభనుకూడా విరామకాలంలో సమావేశపరచుటకు ప్రభుత్వం అంగీకరించెను.

## మదరాసు అసెంబ్లీ

మదరాసు అసెంబ్లీ సెప్టెంబరు 15 తేదీన సమావేశం కాగానే స్వాతంత్ర్యం సంపాదించినందుకు గాంధిమహాత్ముని అభినందించుచు సభానాయకుడు యీ దిగువ తీర్మానం ప్రతిపాదించును:—"ఇండియా స్వాతంత్ర్యం సంపాదించిన సందర్భమున గాంధిమహాత్ముని యీ సభవారు అభినందించుచు త్యాగంచేసిన వారందరిని కొనియాడుచున్నారు."

ఇపుడు శాసనసభ్యులుగా వున్న వారు క్రొత్త ప్రభుత్వం రీతుల భక్తిప్రమాణం పై కొనవలసిన అవసరం లేదని కేంద్ర ప్రభుత్వంవారు తెలిపిరి. సర్ స్టూవర్టు టప్లను గారిస్థానే యూరోపియను వాణిజ్యసంఘం తరపున ఎన్నుకొనబడిన బాచిలరుగారు ప్రమాణం పైకొందురు.

ప్రభుత్వచట్టాలుగ ప్రధాని దేవదాసీ నిర్మూలనచట్టం ప్రతిపాదించెదరు. రాజనుగారు దుకాణాల, హోటలుల బిల్లు సెలక్టు కమిటీ నివేదికను దాఖలుచేసి చర్చింప గోరెదరు. తరువాత మానువరు ఫాక్టరీను బిల్లు, అద్దెబందీచట్టం. వినోదాల పన్ను చట్టం సవరణ బిల్లులు చర్చింపబడును.

కౌన్సిలులో, రాజ్యాంగ పరిషత్తు నిర్ణయించు ఇండియా రాజ్యాంగ నిర్మాణపు బిల్లు రాష్ట్ర శాసనసభలలో చర్చించుటకు అవకాశం మిక్కిలి ఉండగా కోరుచు డా. సర్. ఏ. లక్ష్మణస్వామి ముదలియారుగారు, వృత్తిపరిశ్రామిక విద్యా సౌకర్యాలగూర్చి విచారింప ఒక ఉపసంఘాన్ని నియమింప ఆర్. సూర్యనారాయణ రావు గారును ప్రతిపాదింపదలచిన తీర్మానాలు 17వ తేదీ చర్చకు వచ్చును. అనాడే ఫరూక్ గారి గుర్రప్పందెముల నిషేధచట్టంగూడ చర్చకు వచ్చును.

భారతకేంద్ర శాసనసభలో ఆటమిక్ అసెంబ్లీ బిలు ప్రవేశపెట్టబడు నని పారిశ్రామిక పరిశోధన సంస్థాధ్యక్షులు (డైరెక్టరు) సర్. ఎస్. ఎస్. భట్నగరుగారు 10 తేదీ మద్రాసులో తెలిపిరి.

## ఢిల్లీ సేనలకు ప్రత్యేకాధికారాలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 9: "కాల్చవలసి వచ్చినప్పుడు చంపుటకు కాల్చుడు" అని సేనాధిపతి మేజర్ జనరల్ రాజేంద్రసింగు గారు ఢిల్లీ ప్రాంతమునందలి సైనికదళములన్నిటికి ఉద్బోధించెను. "ఈ దేశ భద్రత తన వ్యక్తిఋణబాధ్యతయని ప్రతి సైనికుడుగ్రహించినప్పుడే ఈ అత్యవసర స్థితిని మనము దాటగలము" అని ఈ త్రయపులో ఆయన చెప్పుచున్నాడు.

## జాతీయ విజ్ఞాన పరిషత్తు
### శివశంకరశాస్త్రిగారి అధ్యక్షతను సమావేశం

మదరాసు, సెప్టంబరు 10: స్వామి శివశంకరశాస్త్రిగారి అధ్యక్షతను నేడుదయం వి. పి. హాలులో పైపరిషత్తు ప్రథమ సమావేశం ప్రారంభమయ్యెను. శ్రీ టి ప్రకాశం, కోటిరెడ్డి, డా. బలరామకృష్ణయ్య, ఏటుకూరి నరసయ్య, పాన్నేరి రామకృష్ణయ్య, కొరత సత్యనారాయణ, పెనుమత్స సత్యనారాయణరాజు, శ్రీరంగం నారాయణబాబు, గిడుగు సీతాపతి, గరిమెళ్ల సత్యనారాయణ, గడియారం శేషశాస్త్రి బి. ఎస్. మూర్తి గార్లును ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, త్రిపురసుందరమ్మ బత్తుల కామాక్షమ్మ మున్నగు స్త్రీలు 50 మందితో మొత్తం 200 మంది సభకు హాజరయిరి. ఆంధ్రమహిళాసభ విద్యార్థినుల వందేమాతరగీతం, కల్లూరి వెంకటరమణ దీక్షితులుగారి పతాక గీతము సేవాదళ బాలికల పాటలతో కార్యక్రమం 9-50 కు ప్రారంభమయినది. దేశిరాజు కృష్ణశర్మగారు శివశంకరశాస్త్రిగారిని అధ్యక్షులుగా ప్రతిపాదించిరి.

ఆచార్య రంగాగారు యీ సభ ప్రయోజనం గూర్చి తెల్పుచు కాంగ్రెసు క్రమంగా రయితులు, కూలీలచేతికి మారుచున్నదనియు, రాజకీయస్వాతంత్ర్యంతో బాటు ఆర్థికసైతిక స్వాతంత్ర్యంకూడా రావలసియున్నది కనుక "బుద్ధిశీలురయినటువంటి వారిద్వారా సామాన్యప్రజలయందు చైతన్యం కలిగించుటకును, సామాన్యప్రజలలో నూతన భావాలు కలిగించుకొనుటకు కవులు గాయకులు మున్నగు విజ్ఞానవంతుల సహాయం బడయుటకు యిట్టి సభలు అవసరమనిరి.

కవులువారియొక్క మహత్తరమయిన శక్తి మానవకల్యాణానికి ఉపయోగించాలనిరి. జాతీయాభివృద్ధికి ప్రతాపరుద్రులే గాక, యుగంధరులు నాగమ బ్రహ్మ దేవులు కూడా యుండాలి. ఏమీ చదువుకోని రయితుకు కార్మికులే రాజకీయాలందు పాల్గొని మంత్రులు పాలకులగుచుండ, విజ్ఞానధనులెందుకు రాజకీయములందు పాల్గొనరాదు? రాజకీయవేత్తలు, సామాన్యజనులు కవి పండితులకు అన్యోన్యసంపర్కం ఏర్పరచుకొనుటకు యీ సభ అవసరమని చెప్పి, ఆం. రా. కాం. సంఘం తరఫున సమావేశకర్తలకు దే. కృష్ణశర్మగారికి కృతజ్ఞత దెలిపిరి.

కవి ఎవ్వరినీ లెక్కచెయ్య కూడదు. ఎవ్వరికీ అమ్ముడుపోగూడదు. అమ్ముడుపోయినవారు తరువాత" దీనారటంకాల తీర్థమాడించిన"అని విలపించవలసి వస్తుంది. ఐన్‌స్టీన్ అభిప్రాయంకోసం పాటుబడితే, హిట్లర్ ఆయన్ను వెళ్లగొట్టాడు. ఆయన పాతం అమెరికాలో తలదాచుకొన్నాడు. విప్లవకవులు ప్రజ్వరిల్లటానికి వెనుకాడే సమయంలో, దాన్ని ప్రజ్వలింపజేసి ప్రజలకు దోవచూపే బాధ్యతలే రచయితది అన్నారు శ్రీ రంగాగారు

శ్రీ అడివి బాపిరాజు మాతృభావను స్తుతించి, మనకు మన విజ్ఞానం ఏమవుతుందానని మన హృదయాలు ఆందోళన పడుతున్నాయన్నారు. ప్రస్తుతం శిల్పాన్ని ప్రోత్సహించేవారు కనబడటంలేదన్నారు: అనేక శిల్పాలు, చిత్రాలు ఆదరించేవారు లేక మూల పడిఉన్నాయి. ఇప్పుడు ప్రజలే ప్రభుత్వం కాబట్టి ప్రజలకు ప్రాతినిధ్యం వహించే జాతీయసంస్థ కవులను పోషించాలన్నారు.

శ్రీ తిల్లోరపుల శంకరశాస్త్రిగారు, కొందరు కొందరు ఆంధ్ర జనసామాన్యం వెనకపడి ఉన్నారనటం సత్యదూరమన్నారు. ప్రజలు కొందరు విద్యాధికులు వాడే పెద్దపెద్ద వాక్యాలు మాట్లాడలేకపోవచ్చు. కాని వారికి విజ్ఞానం లేదనటం పొరపాటు. ప్రతివారికి అభిప్రాయాలుంటాయి. అయితే అవ్యసరసమూ, విరసమూ, నీరసమూ చూసుకొని, ప్రకటించాలి. కవి ముందు అత్మబోధచేసుకొని ప్రజాబోధ ప్రారంభించాలి బోధను స్వీకరించుటానికి అర్హులున్నాయి. భాషను ఉపయోగించుటాకి ఔచితిచూడాలి. అవసరానికి తగినభాషను వాడటం మంచిది. భాషను కొన్ని నియమాలతో వాడటం చాలా అవసరం. ఇంతకీ మనకు సంపూర్ణమైన నిఘంటునిర్మాణం జరగాలి. నియమాల ననుసరించటం స్వాతంత్ర్యంగాని, విశృంఖలంగా ఏపనిచేయటం స్వాతంత్ర్యం అనిపించుకోదు. ఏఏ భావములు ప్రజలకు అవసరం అన్నేపక్షం చాలా వాదప్రతివాదాలని లేవదీసింది. వెనకటి రోజుల్లో నీతిశాస్త్రమే రాజకీయశాస్త్రంగా ఉండేది. దాన్ని మన పరిషత్తువార్లు పునరుద్ధరించాలి. మన ఆంధ్ర చరిత్రను కూడా సమగ్రంగా ప్రచురించాలి.

కొందరు మన పూర్వసాంప్రదాయబద్ధమైన సాహిత్యాన్ని నిర్మూలించాలంటున్నారు. రెండుకాళ్లు ఎత్తి తిన్నటం లాగావుంది, పాతసాహిత్యాన్ని చంపి, దానపై కొత్త నిర్మాణం చేయాలన ... ప్రాయాలంటున్నారు. మూడవకుంటల్ని మక్షినిపాలికీలు చూస్తున్నాయి. అనారోగ్యం అనుపర్తులపై బడింది. పట్టనిర్మాణం శాసనసభలకి. ఇంకకవికొకకవి నీటిపై ప్రాబల్యాన్ని సంపాదించాలని ప్రయత్నిస్తే, కవి నిరంకుశుడు అవుతాడేమోనని భయంగావుంది. అందుకని కవి కేవలం వాస్తవ జగత్తును పట్టుకునే పాకులాడలేదు. కవికి ఆధ్యాత్మికం అంత అవసరం. విజ్ఞాన పరిషత్తు వారు ఆంధ్రదేశంలో సంపూర్ణ విజ్ఞాన నిర్మాణ కావించాలి.

శ్రీ పెనుమత్స సత్యనారాయణగారు (తెలుగురాజు) పూర్వకవులు ఆ నాటికి ... ప్రాశారన్నారు. అదే కవులు ఇవ్వాళకూడా ఈనాటికి ... స్తాం. ... కవిత్వం నేర్పిగా ... కాటం ... పట్టించుటుంచ. బ్రహ్మసృష్టి కన్న కవి సృష్టిమిన్న. ఆచార్య గిడుగువారు భాషకన్న భావం ప్రధానమన్నారు. మా కదేధ్యేయం. మేం ఏ చెయ్యాలో మననాయకులు మనకు సూచించాలని కూడా కోరుతున్నా నన్నారు శ్రీ తెలుగురాజు గారు.

శ్రీ ఏటుకూరి నరసయ్యగారు ఈ జాతీయ విజ్ఞాన పరిషత్తులో వాదోపవాదాలకు తావులేదు. ఇది విశ్వపరిషత్తు, కవులంతా దీనిలో ఉండవచ్చు.

వెనుక చరిత్రతోటి ప్రస్తుత చరిత్ర జోడించి— కరావిభూతితో— కవిత్వం నిర్మించి రైతులకు, కూలీలకు, ప్రజలకు కవి అందించగలడు అన్నారు. ప్రజాకవిత్వమునకు ఉదాహరణగాతమరచనలను కావ్యముగా చదివారు శ్రీ నరసయ్యగారు.

శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు తమకు అడుగున్నంత తపడు వచ్చినది. ఇంటిదగ్గర, 'కళ్లజోడు' తన అప్పటికి చెప్పారు. స్వతంత్రభారతంలో స్త్రీస్థానం చెప్పుచున్నారు నన్ను స్త్రీ గృహంలో ఎప్పుడూ స్వాతంత్ర్యమే. కారం చెవుదగ్గర పెట్టుకొని, మొగుని వళపప్పుకొని అంతా స్వతంత్రం అనుభవించాలి ఇదే మాకాంతం సందేశం అని శ్రీ మునిమాణిక్యంవారు అనేక హాస్యరసపూరితమైన 'కుటుంబకథలు' చెప్పారు. శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ గారు — 'మా కొద్ది తెల్లదొరతనము' రచయిత— తమ 'తోలగాలి, తోలగాలి' ఆనేగేయాన్ని చదివి వినిపించారు.

శ్రీ గంజికుంట సుబ్బారావుగారు తమ 'కార్మిక కర్షకపు బంధనమునుంచి' పద్యములను చదివిరి.

సభ తిరిగి సాయంత్రం నాలుగింటికి సమావేశమైంది.

## ధాన్యసేకరణ పరిస్థితి
### మంత్రి రాజనుగారి ప్రకటన

మదరాసు, సెప్టె 11: డా॥ రాజను గారు ఆరోగ్యశాఖ మంత్రి యిట్లు ప్రకటించుచున్నారు: మంత్రులు, ఆహార శాఖోన్నతోద్యోగులు జిల్లా కలక్టరులు అందరూ అన్ని జిల్లాలలో సంచారంచేసి ధాన్యసేకరణ కార్యం ఉద్ధృతం చేసిరి. మంత్రులంతా తిరిగివచ్చిరి. తత్ఫలితంగా 4/9 తేదీతో అంతమయ్యే వారమునందు 23/8 తేదీ వారంకన్న అధికం 4500 టన్నులు ఎక్కువగ చేకూరినవి. వారం మొత్తం సేకరణ 10,000 టన్నులను మించింది. ఇంకను సేకరణకార్యం చురుకుగ జరుగుచున్నది. ప్రతిరోజు సంఖ్యలు చేరవు. కాని రేళమంతట ఉత్పత్తిదారులు మంత్రుల విన్నపాన్ని బాగుగ మన్నించి సహాయపడుచున్నారు. వచ్చే రెండువారాలు యింకా ఎక్కువ చేకూరవచ్చును. ప్రభుత్వోద్యోగులు ఒత్తిడి అట్టే అవసరం లేకుండానే యిచ్చేస్తున్నారు గనుక, ఉత్పత్తిదారుల చర్య నిరుత్సాహంగా లేదని ప్రభుత్వంవారు తలంచుచున్నారు. ఇంకను కట్టునిట్టములతో స్థిరంగా వచ్చే ఏడు ముందునుండి ప్రచారం చేయుట అవసరం.

రానున్న కొరత ప్రమాదం గూర్చి ప్రజలకు తెలియ జేయుట మంచిదను ప్రబోధం కలిగించింది. ఆయా జిల్లాలలో సేకరించిన వరకు జిల్లాలకు స్వయం సమృద్ధిగా నుండగలవు. అందువల్ల రాష్ట్ర నిలవనుండి వాటికి ఎక్కువ పంపవలసిన అవసరముండదు. కాని రయితుల కద్ద యింకను మిగిలియున్న అదనం వరకు యిచ్చిన రాష్ట్ర నిలవకు చేరగలదు. కురువై పంట వచ్చినాక సేకరణ హెచ్చగలదు. ప్రమాదావస్థ దాటిపోయినామని అప్పడే చెప్ప వీలులేదు. ఈ తీవ్ర సేకరణ ప్రచారం కొనసాగి మంచి ఫలితం చేకూరినచో ప్రమాదం దాటగలము. ధాన్యసేకరణ సమర్థతతో యింకను కొనసాగాలి. చాలమంది ఉత్పత్తిదారులు తాము తిండికై ఉంచుకున్న దానిలో నుండి యిచ్చిరి. ముందు కరువువస్తే ఏంచుద్దాని భయపడుచున్నారు. మొత్తంపై ప్రజలంతా అన్ని ప్రాంతములందు జీవనానికి చాలినంత ఆహారం సంపాదించగల్గుచున్నారు. కురువై పంట అంతాను జొన్నలు రాగులు కంబులు గూడ పండగానే సేకరించుటకు తగు ఏర్పాటులు ... గానే పండినవి. ఢిల్లీలో ఆహార విషయమును చర్చ జరిగినపిదప నుంగు కార్యక్రమం నిర్ణయించబడును."

### తంజావూరు సేకరణ

తంజావూరు జిల్లాలో ధాన్యసేకరణ గరిష్టసంఖ్యతో యింకా 54,000 టన్నులు రావలసియుండని ప్రధాని పత్రికా ప్రతినిధులకు తెలిపిరి. వారు రెండువారాలలో యిమ్మని మిరాసీదారులను కోరిన 30,000 టన్నులు వారు స్వప్రయోజనానికై ఉంచుకున్న దానిలో నుండనియు, సంబ (తొలి) పంటలో యివ్వవలసిందంతా యిచ్చేరని, యింకా కురనాయిపంట కోతలంకాలేదు, కనక ఇంకా 80,000 ప్రభుత్వం సేకరించగలదని కూడ చెప్పిరి.

### రాజనుగారిచ్ఛింద్ర

డా॥ రాజనుగారిట్లు ప్రకటించిరి: నా పాలంలోనుండి నేను యిచ్చిన ధాన్యం ఎన్నో చెప్పలేదని కొన్ని పత్రికలు విమర్శించినవి కనుక ప్రజల తెలియుటకుగాను యీదిగువ సంఖ్యలు ప్రకటిస్తున్నా: 1946-47 సం॥ నా పొలాలలో కోతయిన పంట 1347 కలములు (1 కలం 20 మద రాసు పడులు) అందు 692 కలముల 10 మరక్కాలు ప్రభుత్వానికి యిచ్చి మిగిలినది కూలీలకు విత్తులకు యింటి వాడుకకు వుంచితిమి.

## బర్మాస్వాతంత్ర్య బిల్లు
### అక్టోబరు సమావేశంలో రాజప్రకటనతో జరగవచ్చు

లండన్, సెప్టెంబరు 9: బర్మాకు అధికార ప్రదానం చెయ్యటం విషయమై జరగవలసిన శాసనకార్యకలాపం అక్టోబరు మాసాంతంలో ప్రారంభం కానున్న బ్రిటిషు పార్లమెంటు నూత్న సమావేశం మొదట్లో బ్రిటిషురాజుచేసే ప్రసంగంలో ప్రకటింపబడుతుందని రాయిటర్ రాజకీయ విలేఖరి తెలుపుతున్నాడు.

ఈ శాసన కార్యకలాపం పార్లమెంటు ఆటమ్ సమావేశంలో అత్యధికప్రాముఖ్యం వహిస్తుందనీ సమావేశం ప్రారంభం కాకముందే శాసనముసాయిదా పార్లమెంటుకు అందవచ్చుననీ లండనులోని సాధికార రాజకీయవర్గాలవారు భావిస్తున్నారు.

ఈ బిల్లు చాలా చిన్నదిగా ఉంటుందనీ ఇండియా పాకిస్థానుల విషయమై జూలైలో ప్రవేశపెట్టబడ్డ బిల్లుమాదిరే సంక్షిప్తంగా ఉంటుందనీ అనుకుంటున్నారు.

## చల్లపల్లి లంకల్లో భూములు
### హైకోర్టులో జమీందారు పిటిషన్ నిరాకరణ

చెన్నపురి, సెప్టెంబరు 10: లోగడ చల్లపల్లి ఎస్టేటుకు సంబంధించినట్టి దక్షిణ బాలవారి లంకలోని 52½ ఎకరాల భూమిని-రైతులకు జమీందారుకు జరిగిన ఘర్షణల మూలమున-145 సెక్షన్ క్రింద ప్రభుత్వము వశపరచుకొనవలెనని ఉత్తరవు చేయబడినది. 27-6-47 నాడు బందరు సబ్‌డివిజనల్ మేజస్ట్రీటు గారు సదరు భూమియొక్క 1347 ఫసలీ సాగుహక్కును వేలము పెట్టిరి. కాని 17-7-47 నాడు, ఇంతకుముందునుంచి ఆ భూమిని సాగు చేయుచున్న కొల్లి రామస్వామి తదితరులు ఆ వేలం అన్యాయమని విన్నవించుకొనగా తిరిగి బందరు యస్. డి. యం గారు ఆ వేలమును రద్దుపరచిరి. దీనిపై చల్లపల్లి జమీందారు హైకోర్టులో వేలను చేయరాదని పిటిషన్ పెట్టుకొనిరి. న్యాయమూర్తి పి. గోవిందమీనన్ గారు ఆ పిటిషన్‌ను నిరాకరించుచూ నేడు తీర్పు నిచ్చిరి.

## మంత్రివర్గసమావేశము

మదరాసు సెప్టెంబరు 10 మదరాసు మంత్రివర్గ సమావేశం నేడు ప్రధాని ఓమండూరు రెడ్డిగారి అధ్యక్షతను సమావేశమయ్యెను. గవర్నరు లేకుండా కాబినెటుసభ జరుగుటకిదే ప్రథమం. జమీదారీబిల్లు, హిందూ ధర్మాదాయముల బోర్డుబిల్లును చర్చించిరి. 13 వ తేదీన కాంగ్రెసుపార్టీ సమావేశమునందు రెవెన్యూమంత్రిగారు ముందుగా తెలుపచేసినమీదట బిల్లు ప్రకటింతురు.

## లూధియానాలో రైలుపైదాడి

7 వ తేదీన అంబాలానుండి వస్తున్న ఒక రైలును దుండగీళ్లు లూధియానా దగ్గర ఆటకాయించారు. దానివల్ల 14 మంది మరణించారు. 20 మంది గాయపడ్డారు. బంజారాసరాయ్ స్టేషన్, మీదుగా వెళుతున్న ఒక మిలిటరీ రైలులో వారు స్టేషన్ మీద తుపాకులను కాల్చారు. పఠాన్‌కోట్‌లో రెండుసార్లు సైనికులు కాల్చాలి జరపవలసి వచ్చింది. కర్నాల్ జిల్లాలో రెండు గ్రామాల్లో కొన్ని సంఘటనలు జరిగినట్లు తెలుస్తున్నది.

### నాగావళినది నీటిమట్టం

తోటపల్లి సెప్టెంబరు 6: ఈ రోజు నాగావళినద రిజర్వాయరులో నీరు 7. 5 అడుగులున్నది.

# ప్రధాని నెహ్రూ హెచ్చరిక

(1 వ పేజీ తరువాయి)

శాంతిని నెలకొల్పే సాధ్యమవు ప్రజలే నిగ్రహం పాటించి దుష్ట పూనుకోకుండా ఉండాలి గాని మనచేత చేయించడానికి సైనిక ం అపేక్షిస్తూ ఉండ రాదు. మచేత సుహృద్భావం గలవారు, స్వతంత్ర నిరంతరాభ్యుదయ పథ న శ్రేష్ఠ భారతదేశం కావాలని వాం సహృదయ ప్రజానీకం యావత్తూ మంలో మాతో సహకరించాలని చేస్తున్నాను.

దిన 3 వారాల్లో నేను ప్రాప్తిను కల్లోలిత ప్రాంతాలు ంచి వచ్చాను. నేనక్కడ చూచిన తిఘోరదృశ్యాలతో నా మనస్సు న్నది. అనేక భయంకరవిషయాలు విన్నాను. పంజాబులోనూ, ఢిల్లీ ఈ కొద్దిరోజుల్లో జరిగిన దురం కళంకితమైన సన్నివేశం నేను కలసివచ్చింది. ఈరోజుల్లో ఇదే మనకు లభించే విందు. ఈ పరి యొంత ఘోరమైనదైనా మనం నిగ్రహించితీరాలి. మనం రొందు లసిన ఈ దుస్థితిని తొలగించేం క ప్రత్యేకసంస్థను నెలకొల్పాలో ఆ సంస్థనిర్మాణం చాలాభాగం యింది. మేమేదో సహాయం లమన్న ఆశతో మావంక చూసు యు పంజాబుప్రజలను ఇక్కడకు ర్షించడం మా ప్రథమ కర్తవ్యం. హ్రాగ్, మాంట్‌గామెరీ, పిండి, మల్తాన్, గుజరన్‌వాల్, సమ , ఝాంగ్, షేకుపురా జిల్లా మా ప్రజలు పడుతున్న బాధలను మేమాలోచిస్తున్నాం. విమానాల రైళ్లమీదా, మోటార్లమీదా, కతోనూ వారి నందరినీ సురక్షిత లకు చేర్చడానికి మాకు వీలైనన్ని లూ మేము చేశాము.

వ్రపంజాబుకూ తదితర రాష్ట్రా ద్దిన శాంతిభద్రతలతోపాటు అనేక రాలు కూడా స్థాపించాము. తూర్పు నుండి పశ్చిమపంజాబుకు పోవల కికూడా సౌకర్యాలు కల్పించాము. ని పరిస్థితుల ఒత్తిడిచేత మామీద జనాభా మార్పును సాగించడంలో స కృతకృత్యుల మవుతున్నాము. పలను తీసుకురావడమూ, పోతా రినిపంపడమూ రెండూకూడా తగి గంగానే సాగుతున్నాయి. ఇంత క్షోన సంఘటనలు ఏర్పడ్డాయి. గోలం మొదట్లో తూర్పుపంజాబులో నా ఉన్న కొన్ని జిల్లాలకు వ్యాపిం అక్కడనుంచి ఢిల్లీకి గూడా , ఈ నాడు నేను పట్టణంనుంచి తూ ఉన్నాను గాని ఇది ఎంత నివాసయోగ్యంగా లేదు.

మతకలహాలు ఇల్లా వ్యాపిస్తే కొంద వచ్చేఫలితాలేమిటి? పశ్చిమ పం గాధిత ప్రజల రక్షణార్థం మేము గ్నాట్లు ప్రారంభించి వారిని తీసుకు ఆలస్యమయిపోతోంది. ఎందు టే తూర్పు పంజాబులోనూ ఢిల్లీ మేము చెయ్యవలసిన పనులెన్నో కల్పితమైనాయి. ఇక్కడ ఈ ర్యాల్లో నిమగ్నులైన వారం పశ్చిమ పంజాబ్ విషయంలో కొందర పెట్టడంకోసమే ఇవి మని అనుకుంటున్నట్లయితే అం తెలివితక్కువ మరొకటిలేదు. మేం చెయ్యవలసినపని నిజంగా పడంతప్ప మరొక ప్రయోజనం

రోజుల్లో నేను చూస్తున్న విష లాఅసాధారణమైంది. ఎన్నెన్నో దృశ్యాలు చూశాను. మరణావ తన్నుకొంటున్న ప్రజలను ను. ఎప్పుడో అప్పుడు చావనేది ప్పుడు కొందరు మర్త్యులు మృతినొం అశ్చర్యంలేదు. అసలు చావే ధాకరమైనది. అయినా ప్రతి చావకతప్పదు. కాని ఇంతకంటే దారుణకృత్యాలు జరిగాయి. నా దేశ చేసిన ఈ దారుణ కృత్యాలకు చాలా సిగ్గుపడుతున్నాను. ఈ ంల ఫలితం, వీటివల్ల మనకు లభిం అవమానం మన్ని చాలాకాలం పీడిస్తా నేను భయపడుతున్నాను. ఎందు టే దుర్మార్గం మరొక దుర్మార్గం గిపోయింది. ఒకరు చేసిన హత్యను హత్య చెయ్యడంద్వారా అంతమొం ను. అయినప్పటికి మన ప్రజలు మంది ఈ ప్రతిక్రియ విధానంతో లై రోజులో జరుగు తెలియవస్తున్న సంఘటనలతో ఉద్రేకం పొంది పి న్ని క్కిన వారి మాదిరిగానే ంచారు.

పరిస్థితిని ఎల్లా ఎదుర్కోవడం ? గాన్ని విచారించడంవల్ల గాని మన ం ఇంతేలని అధైర్యపడడం వల్ల ప్రయోజనం లేదు. ముందు మనం అసలు పరిస్థితి ఏమిటో తెలుసుకుందాం. కేవలం అశాంతిని చెలరేగుతూ ఉండడము వల్లనేకాక అసలు భారత జాతి స్వాస్థ్యా నికే అపాయకరంగా కనిపిస్తోంది. కాబట్టి ఇది చాలా తీవ్రమైన సమస్య. ఇన్ని దీర్ఘ సంవత్సరాలుగా స్వతంత్ర భారతాన్ని గూర్చి మనం కన్న కలలన్నీ ఈ రూపంలో నేడు సాక్షాత్కరిస్తున్నది?

ఇదే మనం వాంఛించింది కానట్లయితే ఈ కల్లోలం మహాదోషం అని మనంఒప్పు కొని తీరాలి. ఈ అక్రమాన్ని మన సర్వ శక్తులూ ఉపయోగించి ప్రతిఘటించాలి. ఎంత సంకుచిత దృక్పథంతో చూచినా, చివరకు ప్రతీకారమే అందామనుకున్నా ఇంతకంటె అక్రమమైన విషయం మరొకటి లేదని మన ప్రజలకు మనం నచ్చచెప్పాలి. ఎందుచేతనంటే అసలు ప్రతీకారమే తప్పని. అయినప్పటికీ ఇదిమాత్రం ప్రతీకారంకూడా కాదు. మనప్రజలను మనం రక్షించుకోవడానికి అడ్డుపడుతున్న అవివేక కార్యం మాత్రమే! అంతేకాదు ప్రపంచ దృష్టిలో దీని మూలంగా మన కెంతో అప్రతిష్ఠ కలుగుతోంది. అంతటి తో పోక మన హృదయాల్లో తీరని అవ మానాన్ని రగుల్కొల్పుతోంది. అది ఎన్నో కాలానికి గాని చల్లారకపోవచ్చు.

ఇది చాలా తీవ్ర పరిస్థితి. తీవ్ర పరిస్థితి అని నేనంటున్నానంటే సైనిక దృక్పథం తో కాదు. అదృష్టావశాత్తూ దీన్ని త్వరలో నే నిర్జించగలం. నిజానికి నేటి పరిస్థితి చాలా భాగం సైనికాధికారుల అదుపులో నే ఉన్నది. రేపు ఎల్లుండిలో వారు పూర్తిగా అదుపులో పెట్టగలరు. కాని ఇల్లా సైనిక బలప్రయోగంతో శాంత పరిస్థితి నెల కొల్పుకుంటూ ఇండియాలో ఎన్నాళ్లు బ్రతకగలం? ప్రజలే ఆత్మనిగ్రహంతో దుష్ట చర్యలకు దూరంగా ఉండి ప్రశాంత పరిస్థితిని నెలకొల్పాలి. మిలిటరీ వారు చేసినా ఇదేకదా చేసేది? ఇంతమాత్రానికి వారి సహాయం కావాలా?

అందుచేతనే నేటి పరిస్థితి చాలా తీవ్ర మైందని నేనంటున్నాను. మనం ఎటువంటి భారత దేశాన్ని వాంఛిస్తున్నాం? మనం దానికోసం కృషిచేస్తున్నామా లేక దాన్ని నాశనం చేసే అకృత్యాలకు పాల్పడు తున్నామా?

ఇక ఈ అసహ్య పరిస్థితిని మనం అంత మొందించి తీరాలి. దేశం యావత్తూ సుస్థిర శాంతి భద్రతలు నెలకొల్పాలి. పశ్చిమ పంజాబులో మన ప్రజలను మనం రక్షించాలి. జనాభా మార్పు విషయంలో ఎక్కడ అవసరమైనా అవతల వారితో మనం సహకరించాలి. ఈ దుశ్చర్యలకు పూనుకుంటున్న ప్రజలు సాధించాలను కుంటున్న మహా కార్యానికి ఈ హత్యలు, ఈ దారుణగృహదహనాలు ఇవన్నీ తీవ్ర ప్రతిబంధక మవుతున్నాయి.

మన తరువాతి తరాలవారికి ఎటువంటి భారతదేశాన్ని తయారుచేసి ఇవ్వదలచు కున్నామో ఆలోచించి ఆ దృష్టితో వీరందరూ వ్యవహరించాలనికోరుతున్నాను. ఇటువంటి కల్లోలాలే సాగుతూ ఉన్నట్ల యితే, నేననుకుంటున్నట్లుగానే వీరు కూడా ఇవి అంతంకావాలని వాంఛిస్తున్న ట్లయితే మన సర్వ సామర్థ్యాలూ వినియో గించి వీటిని పాతిపెట్టడానికి పూనుకోవాలి. ఇందులో మెత్తపడడంగాని దయాదాక్షిణ్యాలు చూపాలనికోవడం గాని పనికిరాదు. దుర్మార్గానికి మర్యాద ఎందుకు? ఈ పరిస్థితిని ఎదుర్కోవడంలో ధైర్యస్థైర్యాలను ప్రదర్శించాలి. ఇప్పు డప్పుడు ప్రజలకు కూడా అపాయంకలగ వచ్చు. అయినా వెనుకంజ వెయ్యడానికి వీలులేదు. అమాట ఉపయోగించడానికి నా కిష్టంలేదు గాని అవసరమయితే నిర్దా క్షిణ్యంగా అతి కఠినంగా అణచి వెయ్యా లని అంటున్నాను. ఎప్పుడో ఒకప్పుడు చూపబడే కాఠిన్యం చాలాకాలంపోయాక ఎంతో దాక్షిణ్యం అనిపించ వచ్చు. ఇప్పుడు ప్రజలు చేస్తున్న ఘోరాల్లో ఎంతో రాక్షసత్వం ఉన్నది. దీన్ని ఇలా కొనసాగనిస్తే ఇది విపరీతంగా వ్యాపించి మనజాతినీ జాతీయాశయాలనూ ధ్వంసం చేసివేస్తుంది. అందుచేత ప్రజలందరూ ముందుకువచ్చి ఆ శక్య శ్రేయస్సుకోసం మాతో బహిరంగంగా సహకరించి వీటిని వెంటనే అణచివెయ్యాలని విజ్ఞప్తి చేసు న్నాను. కేవలం 'సైనికబలప్రయోగంతో' వీటిని నొక్కిపెట్టడం మా కిష్టంలేదు. సుహృద్భావంతో నిరంతరాభ్యుదయ స్వతంత్ర భారతాన్ని వాంఛించే సర్వ ప్రజల సహకారమూ మాకు కావాలి. వారం దరూ వచ్చి మాకు సహాయం చెయ్యాలని కోరుతున్నాను. వారందరూ శాంతిమాత లకు ఒక్క ఢిల్లీలోనే కాక తూర్పు పం జాబులో చుట్టుపక్కల జిల్లాలలో ప్రశాంత పరిస్థితులను నెలకొల్పడానికి కృషి చెయ్యాలని వాంఛిస్తున్నాను. అల్లా చెయ్యడంవల్ల పశ్చిమపంజాబ్ బాధిత ప్రజలను సంరక్షించడమే కాక ఇన్నా ళ్ళుగా మనం నిర్మించదలచుకొన్న పూర్ణ స్వతంత్ర మహాభారతాన్ని నిర్మించగలము. అభ్యుదయకాము లందరూ సన్నద్ధించి ముం దుకు రావాలి.

పశ్చిమ పంజాబ్ ప్రజలను తీసుకురావ డంలో ఏమాత్రం ఆలస్యమయినా వారి ప్రాణాలకు ముప్పు వస్తుందన్న విషయం గుర్తుంచుకోవాలి. ఈనాడు ఢిల్లీలో జరుగు తున్న కార్యాలవల్ల పశ్చిమపంజాబ్ ప్రజ లను చేరవెయ్యడం ఆలస్యమవుతోందని జ్ఞాపకముంచుకోండి. అక్కడి ప్రజల రక్షణకై పోవలసిన సైన్యాలు ఇక్కడ కలహాల నణచడానికి ఉపయోగించవలసి వస్తోందని తెలుసుకోండి.

ఇక్కడే ఉపవాసం మన నాయకుడు, మన గురువు మహాత్మాగాంధీ ఢిల్లీకి వచ్చా రు. నేనాయనను చూడడానికి వెళ్లి ఆయన పక్కన కూర్చుని ఆ మహానుభావుడు మన ముందు పెట్టిన మహోన్నతాదర్శాల దృష్ట్యా మనం యెంత అధఃపతితులమై ఉన్నామో తలచుకొని సిగ్గుతో కుంచిం చుకుపోయాను. చుట్టుపక్కల పల్లెల పైపుకు పోయిచూస్తే కత్తులూ గొడ్డళ్లూ పుచ్చుకుని తిరుగుతున్న ప్రజలు కని పిస్తారు. వారు నన్ను గూడెంలో జే మహాత్మాగాంధీకి జై, జవహర్‌లాల్‌కీ జై అని అరుస్తారు. హత్యలూ దోపిడీలూ గృహదహనాలూ చేసి కాబోలు తిరుగుతున్న ఆ ప్రజలు ఆమాట లు అంటుంటే వినడానికి నాకు సిగ్గు వేస్తుంది. ఊరికే నినాదాలు చేసినంత మాత్రంలో వారుచేసిన దుష్కృత్యాలకు నిష్కృతి లభించదు. మీరు మహాత్మా గాంధీని గౌరవించినంత మాత్రాన, ఆయన ఇన్నాళ్ళనుంచి మనకు బోధిస్తున్న అపూ ర్వసిద్ధాంతాలను ఆచరణలో పెట్టకపోతే, మన మీ అక్రమాలను అతిక్రమించలేము. ఈనాడు జరుగుతున్న దానికీ ఆయన బోధిం చిన దానికీ ఎంతమాత్రమూ సంబంధం లేదు. ఆయన మహా బోధ ఎక్కడ? ఈ దారుణ కృత్యా లెక్కడ? అవి ఇవి పూర్తిగా విరుద్ధం. ఈ విషయం తలుచుకుంటేనే నాకెంతో సిగ్గవేస్తుంది. ఒక్కొక్కప్పుడు మనం ఇన్నాళ్లుగా సలిపిన సత్కృషి అంతా నిష్ఫలమయిపోతుందేమో అని భయంకూడాకలుగుతుంది. ఎందుచేతనంటే సత్కృషికి సత్ఫలం దుర్మార్గానికి దుష్ఫ లంతప్పకుండా ఉంటుందని నానమ్మకం.

ఈ దేశంలో ఇప్పటికే జరిగిన దుర్మా ర్గాలు చాలా మితిమీరిపోయాయి. ఇంత కంటె దుర్మార్గం భరించరానిది. దీనికి స్వస్తిచెప్పి ఇప్పటికైనా మహాత్ముని మహాబోధను ఆచరణలో పెట్టడానికి స త్కృషి ప్రారంభిద్దాం.

సదభిప్రాయాలుగల ప్రజలందరి సహ కారమూ మాకు కావాలి. పంజాబు ఢిల్లీ లలో కొన్నిచోట్ల ఈ సమస్య చాలా తీవ్రమైనదే కావచ్చు. కాని ఒక విధంగా చూస్తే ఇది యావద్భారత సమస్య. దీన్ని పరిష్కరించడానికి భారతజాతియావత్తు పూనుకోవాలి. ఈకల్లోలాలన్ని అనుసరించి మరింత దారుణసంఘటనలు ఏర్పడవచ్చు నని జ్ఞాపకముంచుకోండి! అవి ఘోర రూపంలో వ్యాపించవచ్చు. ఇప్పటి పరి స్థితినిబట్టిచూస్తే మనం ఇంచుమించు మహాక్షామకూపం అంచున నిలబడి బ్రతుకు తున్నాం. దేశంలో మనకు సరిపడ ఆహారంలేదు. ఈకల్లోలాలవల్లఉన్న పంట కూస్తా నాశనమయింది. గోధుమ గ్రాసం లేక తిరుగాడుతున్నాయి. పంట పొలాలు గడ్డిపరకలేకుండా ఎడారులైనాయి. ఇటు వంటి ఆహారపరిస్థితి ఎల్లాపరిణమిస్తుందో నాకు తెలియదు.

అందుచేత మనమికనైనా నడుంకట్టి కష్ట పడి పని చెయ్యడానికి పూనుకోవాలి. నిరంతర సహకారంతో కృషి చెయ్యాలి. ఇందుకోసం మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాను. ఆయుధాలు పుచ్చుకుని వీధుల్లో తిరగ డానికి ఇష్టపడను మరిచిపోకుండా విషయం కూడా మీరు జ్ఞాపకముంచుకోవాలి. అవన్నీ ఇప్పుడు పనికిరావు. శాంతి కాలంలో మేము ఏం అనుమతించినా యుద్ధంతో తుల్యంగా ఉన్న నేటి మత కలహ పరిస్థితులలో అటువంటి వాటికి మేము అవకాశం ఇవ్వలేము. అర్థాత్తూ యుద్ధాన్నిఎదుర్కొన్నట్లే మేమీ పరి స్థితిని ఎదుర్కొంటాం. ఈకలహాన్ని సర్దించడంలో ఇక మీద ఎంతమాత్రమూ సహింపు ఉండదు."

## ఇండియాకు అర్జెంటైనా ధాన్యం

### రెండుదేశాల ఒడంబడిక

కలకత్తా, సెప్టెంబర్ 9: ఇండియాకు అర్జెంటైనా ధాన్యాన్ని పంపేట్టూ, దానికి ప్రతిగా అర్జెంటైనాకు జనపనారసంచులూ మొదలైన జనపనారవస్తువులను పంపేట్టూ రెండుదేశాల ప్రభుత్వాలూ ఒక ఒడంబడిక కను చేసుకున్నవి. ఈ ఒడంబడికను అను సరించి 69 వేలటన్నుల జనపనార వస్తువు లను అర్జెంటైనాకు పంపవలసివుంటుంది.

బెంగాల్ జనపనారమిల్లుల సంఘం వారు వీటిలో సగభాగాన్ని తక్కువధరకే ఇండియా ప్రభుత్వానికి ఇచ్చేందుకు అంగీ కరించారు.

# మైసూరు నూత్న రాజ్యాంగం

## జూన్ మాసానికి సిద్ధము అవుతుంది

బెంగళూరు, సెప్టెంబరు 9: మైసూరు రాజ్యాంగ సలహాసంఘమువారు ఈరోజున సర్ రామస్వామి మొదలియార్ అధ్యక్షత సను సమావేశము అయినారు. నియోజక వర్గాలను గురించి ఓటింగ్ పద్ధతులను గురించి ప్రాతిపదిక హక్కులను గురించి న్ని ప్రత్యేకాధికారాలను గురించిచర్చించి నారు. వయోజనులందరూ ఓటు చేసే హక్కు ఉండవలెనా అధిక సంఖ్యాకులు ఓటుచేసే హక్కు ఉండవలెనా అనే విష యములో అభిప్రాయభేదాలు వచ్చినవి. ఇప్పుడు జనాభాలో నూటికి 39 మందికే ఓటింగుహక్కు ఉంది. ఇది ఇంకా విరి విగా ఉండవలెనని కోరినారు.

సమిష్టి నియోజకవర్గాలే ఉండవలెననీ అయితే మైనారిటీలకున్నూ వివిధ వర్గాల కున్నూ ప్రత్యేక స్థానాలు ఉండవలెననీ అది ప్రాంతీయపద్ధతిన నిర్ణయము కావలె నని కమిటీవారు అభిప్రాయ పడ్డారు. ఇండియన్ యూనియన్ ప్రభుత్వానికి దత్తముచేసిన అధికారాలుపోను విదేశ వ్యవహారాలలోనూ రాజనగరుకు సంబం ధించిన విషయాలలోనూ హైకోర్టు జడ్జి లను నియమించుటములోనూ మహారాజుకు ప్రత్యేక అధికారాలు ఉంటవి. మహా రాజా అత్యవసర పరిస్థితులలోనే ఆ అధి కారాలను చెలాయిస్తారు.

కొత్త రాజ్యాంగ విధానము వచ్చే బడ్జెట్టు సమావేశమునాటికి అనగా జూన్ మాసానికి తయారు అవుతుందని ఈ కమిటీ వారివల్ల తెలుస్తూ ఉంది.

## మైసూరుగ్రామాలలో సత్యాగ్రహం

బెంగళూరు, సెప్టెంబరు 9: అయిదు గురు విద్యార్థులు ఊరేగింపుగా బయలుదేరే సరికి పోలీసులు వారిని అరెస్టు చేసినారు. అంతటవారు నేలమీద చతికలబడి కూర్చు న్నారు. పోలీసులు తరువాత వారిని విడు దల చేసినారు.

అయాపల్లెపట్టులలో సత్యాగ్రహము ప్రశాంతముగా సాగుతున్నట్టు తెలుస్తూ ఉంది. ప్రభుత్వ కార్యాలయాలను పికెట్ చేస్తున్నట్లున్నూ తాటిచెట్లనూ చందనపు చెట్లను నరికివేస్తున్నట్లున్నూ తెలుస్తూ ఉంది. చందనపుచెట్లు ప్రభుత్వమువారివి.

## కొచ్చిన్‌లో సంపూర్ణ అధికార దత్తత

### రిజర్వుశాఖలపై ప్రజాధికారం

ఎర్నాకులం, సెప్టెంబరు 9: కొచ్చిన్, మహారాజాగారు రిజర్వుడు శాఖలకు దేవ స్వామ్, రాజభవనశాఖలకు శ్రీ టి. కే. నాయరుగారిని కార్యనిర్వహణాధికారి గా నియమించి యున్నారు. ఈ శాఖలను మంత్రులుకాని వారివశముచేయుట మహా రాజుగారికి యిష్టము లేకపోవుటచేత మంత్రులలో నొకని ఈ శాఖలకు నియ మించెనని తెలియుచున్నది. నాయరుగారు ప్రస్తుత మంత్రివర్గములో హోంశాఖ మంత్రి. ఈ నియామకమువల్ల అధికార దత్తత సంపూర్ణమైనది. సవరించ బడిన కొచ్చిన్ చట్టము ననుసరించి ఈ రెండు శాఖలు దివానుకు ప్రత్యేకింపబడినవి. దివానుగిరీ రాజీనామా మహారాజుగారిచేనంగీ కరింపబడి యుండుటచేత ఈచర్య గైకొన బడినది. ఆ. ప్రె.

## మిశ్రమ మంత్రివర్గ సమస్య

### జగుల్‌కిశోర్ ప్రకటన

లక్నో, సెప్టెంబరు 9: "ప్రత్యేక నియోజకవర్గాలను ఇప్పుడు రాజ్యాంగ ప్రణాళికలోనుంచి తీసివేసినారు. ప్రస్తుత పద్ధతిలో కార్యక్రమముతో ముస్లిములీగు వారు ఇకముందు ఏమిచేస్తారో నాకు తెలియదు." అని కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి జగల్‌కిశోరుగారుచెప్పినారు. ఆయన ఇంకా ఈ విధముగా కూడా అన్నారు. "రాష్ట్రాలలో మిశ్రమమంత్రి వర్గాలు ఉండవలెనంటున్నారు. కాంగ్రెసుమంత్రివర్గములో చేర తలచినవారు కాంగ్రెసుపద్ధతినే అనుసరించవలసి ఉం టుందని బహిరంగముగా ప్రకటించిఉ న్నాము. కొన్ని ప్రత్యేకపరిస్థితులలో ఏదో ఒక ప్రయోజనముకోసము ఒక కొన్నిరాష్ట్రాలలోనే మిశ్రమమంత్రి వ ర్గాలు ఏర్పడడానికి వీలు అవుతుంది.

కాంగ్రెసు కమిటీవారికిన్నీ కాం గ్రెసుమంత్రివర్గమువారికిన్నీ ఏ విధమయిన సంబంధము ఉండవలెననే విషయములో నిర్ణీత నిబంధనలు ఏవీ ఉండడానికి వీలు లేదు. అయితే అన్యోన్యసహకారము భారీగా ఉండవలెననేది ఎవరూ కాదనరు. కాంగ్రెసువాదుల ఆమోదము లేకుండా కాంగ్రెసు ప్రభుత్వము సాగజాలదు. ఈ విషయము మంత్రులకు బాగా తెలుసును.

# నిజాంసంస్థానం భారతసమాఖ్యలో చేరలేదని నవాబుగారి ఉద్ఘాటన

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

హైదరాబాద్, సెప్టెంబర్ 9: నిజాం సంస్థానం భారత సమాఖ్యలో చేరినదన్న వార్త, అబద్ధము, ఆధార రహితము, అని నిజాం ప్రభుత్వం నేడొక ప్రకటన చేసింది.

నిజాం సంస్థానం భారత సమాఖ్యలో చేరిందనీ, అధికార దఖలుపత్రంపై నిజాం నవాబుగారూ, సర్దార్ వలభాయిపటేల్ గారూ సంతకాలు చేశారనీ స్థానికపత్రిక ఒకవార్త ప్రకటించింది.

దానిని పురస్కరించుకొని ఇత్తెహాదుల్ ముస్లిమీన్ కార్యదర్శి ఒక ప్రకటన చేస్తూ, అవాస్త నిజాంసంస్థానం స్వతంత్రం గా ఉండాలని కోరే ముస్లిములలో చాలా కలవరం కలిగించిందనీ, ఈసంగతి నిజమో అబద్ధమో నిజాంప్రభుత్వం వెంటనే ప్రక టించాలనీ, ఈ విషయంలో జాగుచేస్తే ముస్లిమీన్ అనుసరించే కార్యక్రమంవల్ల కలిగే పర్యవసానాలకు అసంస్థను బాధ్యు రాలుగా ఏంచరాదనీ అన్నారు.

## పుస్తకాలపై పత్రికలపై నిషేధం

బొంబాయిలోని స్టేట్ పీపుల్స్ ముద్రా లయంలో ముద్రితమై, డేల్ కార్నిజీచే ప్రచు రితమైన 'లిటిల్ నోన్ ఫాక్ట్స్ ఎబౌట్ వెల్ నోన్ పీపుల్' (బాగా తెలిసినవారిని గురించి బాగా తెలియని నిజాలు) అనే గ్రంథాన్నీ, బొంబాయినుంచి వెలువడే 'ఫ్రీప్రెస్ జర్నల్' ఆగస్టు 18వ ప్రచురించిన సంస్థాన ప్రజలఅనుబంధాన్ని నిజాం ప్రభుత్వం సంస్థానంలో అమ్మరా దని నిషేధించింది. పత్రిక ప్రతులను స్వాధీనం చేసుకోవలసిందని కూడా ఉత్త ర్వుజారీగింది.

## విద్యార్థుల సమ్మె

విద్యార్థులు నిన్న జరిపిన 'నిర్బంధ విధాన ప్రతిఘటనదిన' ప్రదర్శనం సందర్భం లో పోలీసులు లాఠీ చార్జి చేసినందుకు అసమ్మతిగా నేడు నిజాం కాలేజి విద్యార్థులు చాలామంది సమ్మె చేశారు. నగరం లోని ఇతర విద్యాలయాలలోని హిందూ విద్యార్థులు కూడా సమ్మెచేశారు. ప్రదర్శ నములేమీ జరుగలేదు. పోలీసులు మాత్రం జాగ్రత్తచర్యలు తీసుకొంటూనేవున్నారు.

## ఔరంగాబాద్‌లో హర్తాళ్

సంస్థాన కాంగ్రెస్ ఆదేశానుసారం సెప్టెంబరు 9 న ఔరంగాబాదులో పూర్తి హర్తాళ్ జరిగింది. విద్యార్థులు విద్యాల యాలకు పోలేదు. కాంగ్రెసు నాయకులు ఊరేగింపు జరుపగా పోలీసులు అటకా యించి 7 గురిని అరెస్టుచేశారు. అరెస్ట యినవారిలో శ్రీమతులు సరస్వతీ పటక్, ఇందుమతీ పటర్‌గార్లు వున్నారు.

## సత్యాగ్రహుల అరెస్టు

నేడు హైదరాబాద్ సుల్తాన్ బజా రులో భారతపతాకవందనం జరుపుతూ సత్యాగ్రహం చేసిన 6 గురు కాంగ్రెస్ వాదులను పోలీసులు అరెస్టు చేశారు.

## శాసనసభ బడ్జెట్ సమావేశం

నిజాం శాసనసభ బడ్జెట్ సమావేశం సెప్టెంబరు 10, 21 తేదీల మధ్య 8 రోజులు జరుగుతుంది, 13, 14 తేదీలలో సాధారణ చర్చ, 15 న ఆర్థికబిల్లు ప్రతిపాదన, 16, 17 తేదీలలో బిల్లుపై ప్రశ్నలకూ, సవరణ లకూ అవకాశ మివ్వడం, 20 న అనధికార బిల్లులపైనా, తీర్మానాలపైనా చర్చ జరుగుతాయి.

## సుంకముల శాసనోల్లంఘన

### సత్యాగ్రహంలో మరియొకఘట్టం

బెజవాడ, సెప్టెంబరు 10: మధిరతా లూకాలోని ప్రజలు సంస్థాన ప్రభుత్వ సుంకముల శాసనమును ఉల్లంఘించు చున్నారని తెలిసింది. ప్రజలు తమ సామా నులను ప్రభుత్వమునకు సుంకము చెల్లింప కుండగనే సంస్థానము బయటకు తీసుకుని వెళ్లుచుండిరి, అని బెజవాడలోని హైదరా బాద్ సంస్థాన కాంగ్రెసుకార్యాలయము వారు ప్రకటన చేయుచున్నారు.

ఇది ప్రభుత్వమునకు గొప్ప దెబ్బవంటిది దీనివలన నిజాం ప్రభుత్వము దాదాపు రెం డునుండి నాలుగు లక్షల రూపాయలవరకు నష్టపడుతుంది.

## అరెస్టులు

జనగాం, కరీంనగర్, మానుకోటలలో భారతపతాక మెగుర వేసినందుకు అనేక మంది కాంగ్రెసు కార్యకర్తలు అరెస్టు చేయబడిరి. నందయ్య అను వానికి 4 నెలల కఠినకారాగారశిక్ష విధింప బడెను. సంస్థాన అభ్యుత్తమ పత్రిక మాసాన్ని ఉల్లంఘించుట ఆ నారాయణపేటలో ని ప్రజలు దాదాపు 6000 తాడిచెట్లను మొదలంట నరికివేసిరి.

## నిజాంనుంచి వచ్చిన ధనికుల కర్తవ్యం

రేపల్లె, సెప్టెంబర్ 8: ఈ తాలూకా రైతు కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ వనిగళ్ల వెంకటసుబ్బయ్యగారిలా వ్రాస్తున్నారు:

నిజాంనుంచి రేపల్లెకు 40-50 కుటుం బాలవారు వచ్చి ఒక్కొక్క యింటికి వంద రెండు వందలు రూపాయలు అద్దె ఇచ్చి ఉంటున్నారు. ఇదే రీతిగా ఆంధ్ర దేశంలో పలుపట్టణాలలో నిజాం ధనిక కుటుంబాలవారు ప్రాణాలు దక్కించుకొని జీవితాలు కాపాడుకొంటున్నారు. నిజాం లో ప్రభుత్వ దౌర్జన్యాన్ని, గూండాల ఘాతుకాలనూ ఎదుర్కొని ఎందరో స్వాతంత్ర్యవీరులు పోరాడుచున్నారు. పల్లెలనుండి ఎందరో పేదలైన ప్రజలు పట్ట ణాలకు పారిపోయి దిక్కులేని వారై వున్నా రట. అట్టివారికి ఆర్థిక సహా యం అత్యంతావశ్యకం. వారు సలిపే పోరాటాల ఫలితమే ముందు ముందు నిజాం ప్రజలనుభవించే సుఖం. రాజకీయకార ణాలవల్ల ఆర్థికంగా బాధపడే పేదవారికి, అచటినుండి పారిపోయివచ్చిన ఈ ధని కులు సహాయపడాలి. ఆర్థికంగా సహా యం చేయలేకపోతే అచటి ప్రజలు నేటి నిజాం స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించలేని నిస్సహాయస్థితిలో పడతారు. రాజకీయ బాధితుల్ని మనసులో పెట్టు కొని వారి సహాయార్థం ఒక లక్ష రూపా యలైనా పోగుచేయుటానికి ఒకనిధిని ప్రారంభించాలని హెచ్చరిస్తున్నాను. దానికి ఆంధ్రదేశంలోని ఉదారులైన ధన వంతులు తప్పక సాయంచేయాలి.

## సోషలిస్టుల వైఖరి

### బొంబై ఎ. ఐ. సి. సి.లో తేలిపోతుంది

బొంబాయి, సెప్టెంబరు 9: కాంగ్రెసు సోషలిస్టుపార్టీ వారు కాంగ్రెసుతో సం బంధము ఉంచుకొనేదీ లేక సంబంధము తెంచుకొనేదీ బొంబాయిలో జరిగే ఏ. ఐ. సి. సి. వారి సమావేశములో తేలిపో తుందని తెలుస్తూఉంది. సోషలిస్టుపార్టీ నాయకులు ఈవిషయము యిప్పుడు చెప్పి నూ ఉన్నారనీ వారి అధికార వర్గము వారి కాంగ్రెసులో కలసిఉండడము ఇష్ట ములేకుండా ఉందనన్నీ అయితే ఈసమ యములో తాము కాంగ్రెసులోనుంచివెళ్లి పోయి కాంగ్రెసును బలహీన పరచరాదని కొందరు అంటున్నారనీ తెలుస్తున్నది.

## పాలస్తీనాకు వలస వస్తున్న యూదుల విషాదగాధ

### బ్రిటిష్ వారి హింసాకాండ

హాంబర్గు, సెప్టెంబరు 9: బ్రిటిషు నిర్బంధాలను లెక్క చేయకుండా, అష్ట కష్టాలుపడి, చాలిచాలని పడవలలో సము ద్రాలను దాటి దారుణ ప్రమాదాలను ఎదు ర్కొని, మాతృభూమి ఐన పాలస్తీనా చేర ప్రయత్నించిన యూదు యాత్రికుల గాధ చివరకు విషాదకరంగా పరిణమించింది. 'ఎర్రదయ్యాలు' (ఒక బ్రిటిషుసైనికదళ ) శస్త్రాస్త్రాలూ, లాఠీలూ, మంటల నార్పే నీటిగొట్టాలూ తీసుకుని, వారందరిని పూర్తిగా తీవ్రంగా కొట్టి బలవంతాన హాం బర్గు రేవులో దింపివేశారు.

వీరు రెండునెలల తరబడిగా పాలస్తీనా చేరాలనే ప్రయత్నంమీద ఓడలలోనే నివసిస్తూ తిరిగారు. చివరకు బలవంతాన హాంబర్గులో దించేటప్పుడు, బ్రిటిషు సైని కులు పత్రికా ప్రతినిధులను కూడా దగ్గ రకు రానీయలేదు. ఒంట్లో సత్తువ ఆశేది ఉన్నంతవరకూ స్త్రీలతో సహా వీరంతా నిరాయుధంగా బ్రిటిషు సైనికుల అక్రమ ణను ఎదుర్కొన్నారు. అతి విషాద కరంగా యూదు గీతాలను పాడుతూ తమ జీవితాశయం భగ్నంకాగా, బ్రిటిషు సైనికుల ఆక్రమణకు ఎదురుతిరిగేందుకు ప్రయత్నించిన వారిస్థితి ఎంతో జాలికలి గించింది.

చివరకు బ్రిటిషు "ఎర్రదయ్యాల" సైనికదళం "రన్నిమిడ్ పార్క్" లో ఉన్న వారందరినీ బయటికి ఈడ్చుకొని వచ్చారు. ఈ సందర్భంలో 30 40 మంది యూదులు చాలాతీవ్రంగా గాయపడ్డట్లు తెలుస్తున్నది. అందులో స్త్రీలు కూడ ముగ్గురువున్నారు. 4 గురు స్త్రీలు హిస్టీరి యాతో ఆస్పత్రిలో చేర్చబడ్డారు. ఒద్ద బ్రిటిషుసైనికులు గాయపడ్డారు. ఎం పైర్ రైవల్ అనే రెండోఓడలోని యూదుల పైన బాష్పవాయువును ప్రయోగిస్తామని సైనికులు బెదిరించారని వారు తెలియ జేశారు.

## యూదునాయకుల అరెస్టు

ఈ యూదు ప్రతిఘటన నాయకుడు మృదుచె ఘూరీ రోస్మన్‌ను ఇంకా 49 మందితో కలిపి అరెస్టుచేసి హాంబర్గు జైలులో వుంచారు. రోస్మన్‌కు 30 ఏళ్లు. అతడు 10 సంవత్స రాల వయసునుంచీ యూదు ఉద్యమంలో పాల్గొన్నాడు. యుద్ధకాలంలో యూదు రహస్యోద్యమాన్ని నడిపాడు. అతని తలి దండ్రులను జర్మను విషవాయు ప్రయోగం తో చంపి అతనిని రెండుపార్లు దారుణంగా హింసించారు. అతనెప్పుడూ సినిమాలను చూడటంకాని, ఆటలాడటంకాని, చేయ లేదు. "నేను పాలస్తీనాను స్వతంత్రం చేసే నత్యాగ్రహం, అందులో నాసంతానం అవన్నీ అనవసరం" అని అతడు అనేవాడు.

యూదుదౌర్జన్యవాదులతో కలిసి లండన్‌మీద విమానదాడి చేయ కుట్రపన్నా డన్న నేరంమీద రెజినాల్డు గిల్బర్ట్ అనే అమెరికన్ పైలట్‌ను ఫ్రెంచి పోలీసులు పట్టుకున్నారు. యార్డువారు తీసుకు వెళ్లే చెప్పారు.

## మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 10:

వేరుసెనగ: (531 పౌ 1-కి ఎక్స్ కోస్తా గిడ్డంగులు) మెషీన్ (సేల్స్‌టాక్సు తోసహా) సప్లై బజారు 142-0-0.

ఇంగ్లీషుకాండీ (500 పౌనుల గలది) 1-కి ఆఫీసు 145-0-0

వేరుసెనగనూనె: ఎక్స్‌మిల్లర్ (సేల్స్‌టాక్సుతో సహా)

మదరాసు, బజారు వెల 306, 310

ఆముదం మిల్ డెలివరి ఎక్స్‌మిల్లర్ పర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది రు. 340.

కొంకాయనూనె (39 పౌను గల డబ్బా. వెల 29-8-0)

### పంచదార.

2 అందరు "హాస్పేట" రూ. 65-13-2

### బంగారు-వెండి: నేటి మధ్యాహ్నం

1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ వెల 74-8-0 పెట్లాబంగారు తులం 110-12-0 మూస బంగారు 109-0-0. సీమ వెండి తులం 100-కి (రెడీ) 171-0-0 తులం వెండి 1-కి 1-12-0.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, సెప్టెంబరు 9: అక్టోబరు 31.36/31.37 డిసెంబరు 31 07/31 09 జనవరి 31.05/ మార్చి 31 02/31.02 మే 30.75/30.75 జూలై 29 99/30.01 అక్టోబరు 28.65/28.65 డిసెంబరు 28.35/నా..

మిడ్లింగ్ హాజరు 32.21

అక్టోబరు (గరిష్ఠధర) 31.45

(కనిష్ఠధర) 30.99

### అక్టోబరు వాయిదా ధరలు.

| | |
|---|---|
| నేటి ప్రారంభం వెల | 31.01 |
| నిన్న | 31.21 |
| ,, ముగింపు వెల | 31.36 |
| నిన్న | 31.00 |


BYNIN AMARA

జీవితపు వాస్తవికానందము కలుగజేయును—

బైనిన్ అమారా జీర్ణకోశమును చక్కపరచి ఆహారంలోని సత్తువను వంటికి పట్టించును.

ఆధికమైన పనివల్లగాని, అనారోగ్యం వల్లగాని, సీరసస్థితివల్లగాని కోల్పో యిన నరములబలాన్ని తిరిగి యిచ్చి, రక్తాన్ని సృష్టిపరుస్తుంది.

నిరూపించబడిన యీ టానిక్ నొక సారివాడి జీవితపు విశేష మాధుర్యాన్ని అను భవించండి.




అలెన్ అండ్ హాన్‌బరీస్ లిమిటెడ్.
(ఇండియాలో ఇన్‌కార్పొరేట్ చేయబడినది)

# స్వతంత్ర భారతము

1947 ఆగస్టు 15-వ తేది స్వరాజ్యము చేకూరిన కారణమున భారత స్వాతంత్ర్యము

భారతదేశంలో అత్యంత శక్తివంతమైన గురు, శని గ్రహాలయొక్క మార్పుదశ సమసమించియున్నది. ఈ విషయము అసాధారణముగాదు. అద్భుతమూగాదు. కశ్యప, గర్గ, వరాహ, మిహిర, ఖనా, భృగు ఇత్యాదులు సంపుటీకరించిన భారత జ్యోతిష విధానాన్ని క్షుణ్ణంగా తెలుసుకున్న ఎవరైనా, యీ రెండు గ్రహస్థానాల మిత్ర సంబంధానికి యివే సరైన ఫలితాలని చెప్పవచ్చు. రాబోయే నూతన శకమును గురించి యీ ఫలితాన్ని "హవుస్ ఆఫ్ అస్ట్రాలజి" వారు చెప్పియున్నారు. రెండువందల యేండ్లు దాస్యం అనుభవించిన తర్వాత భారతదేశం స్వతంత్ర మౌతు దన్న విషయం యథార్థంగా తెలుపబడినది.



## రాజ్-జ్యోతిషి

పండిత్ హరీశచంద్రశాస్త్రి, జ్యోతిష్తీర్థ, తాంత్రికాచార్య, ఎగ్జామినర్, గవర్నమెంటు బోర్డాఫ్ అస్ట్రాలాజికల్ స్టడీస్.

## హవుస్ ఆఫ్ అస్ట్రాలజి

141/1C, రుస్సారోడ్, కాళిఘాట్, కలకత్తా 26
(హజ్రాపార్కు కు సరిగ్గా తూర్పున)
ఫోను: సౌత్ 978

ప్రాచ్యప్రతీచీ ఖగోళ, జ్యోతిష, ఆధ్యాత్మికశక్తులతో తనకు గల అఖండ పాండిత్యం ద్వారా, మీ భూతభవిష్యద్వర్తమానములను శు. చ. తప్పకుండా తెలియజేయుగలరు. మీ చేయిచూచి గాని, జాతకచక్రం చూచి గాని తాంత్రికవిధులప్రకారం శాంత్యాదికవిధులవల్లను, సర్వశక్తివంతమైన తాయెతులవల్లను ప్రమాదనివృత్తికి సలహా లీయగలరు.

**శాంతి కవచ** మనశ్శాంతికి, కుటుంబసౌఖ్యానికీ, మనోబలాన్ని వృద్ధిచేయడానికి ఉపయోగిస్తుంది. సాధారణపుది రు 5/-లు. స్పెషల్ (శీఘ్రముగా పనిచేయునది.) రు 20/-లు మాత్రమే.

**బగళ కవచ** శత్రువుల జయించడానికీ, చిక్కులు గల దావాలలో నెగ్గడానికీ ప్రమోషను పొందడానికీ, ఇతరులపై అధికారము సంపాదించడానికీ ఉపయోగిస్తుంది. సాధారణపుది రు 12/-లు స్పెషల్ (శీఘ్రముగా పనిచేయునది) రు 45/-లు మాత్రమే.

**నృసింహ కవచ** స్త్రీలలో వంధ్యత్వాన్ని పోగొట్టడానికీ, గర్భస్రావము లకు, ఋతుదోషాలుకుగైరాలకు పనిచేస్తుంది. సాధారణపుది రు 10/-లు. స్పెషల్ (శీఘ్రముగా పనిచేయునది) రు 29/-

**ఆకర్షణి కవచ** ఏ స్నేహితునితోనైనా, శత్రువుతోనైనా శాశ్వత మైత్రి నిస్తుంది. దీనికి అసాధారణమైన శక్తిగలదు. సాధారణపుది రు 12/-. స్పెషల్ (శీఘ్రగుణముగలది) రు 50/- మాత్రమే

ఈ తాయెతులు, తాంత్రికవిధులు మొదలైన వాటివల్ల పూర్తిగా తృప్తినొందిన వారిలో కొందరు:

మిస్టర్ ఫజులల్ హక్, మాజీప్రధానమంత్రి, బెంగాల్; కలనల్ వంషేర్ జంగ్ బహదూర్, నేపాల్ రాణా; మిస్టర్ పి. ఆర్. దాస్, బార్-ఎట్-లా, పాట్నా; మిస్టర్ జె. డి. తాతా, బొంబాయి; శ్రీయుత ఆనంద ప్రసాద్ సింహ ఎం. ఏ, బి.ఎల్., కటోరియా, బర్ద్వాన్; శ్రీయుత రోహిణీ కుమార్ చౌదరి, మెంబరు, కానిస్టిట్యుయెంటు అసెంబ్లీ; శ్రీయుత ఉపేంద్రనాథ్ బర్మన్, మెంబర్, కానిస్టిట్యుయెంటు అసెంబ్లీ; మిస్టర్ రామేశ్వర్ లాల్, బికనీర్ స్టేట్; డాక్టరు కలనల్ పి. చౌదరి, అలహాబాద్; పండిత విశ్వనాథరావు, ఎఫ్. ఐ. సి. ఆఫ్ లాహోరు, ఎఫ్. ఎఫ్. సి. ఎస్. (లండన్); మిస్టర్ రఘునాథ్ సింహా, ఢిల్లీ; మిస్టర్ ఎ. చాండ్లర్, ఇంగ్లండు; మిస్టర్ ఎఫ్. జి. వైట్, దక్షిణాఫ్రికా; మిస్టర్ డబ్ల్యు. హెచ్. లైన్, 826, వాషింగ్టన్ అవెన్యూ యు. ఎస్. ఎ., సేట్ వైద్యనాథ ఝున్‌ఝున్‌వాలా, జోధ్‌పూరు; రామశరణదాస్, శిఖిం స్టేట్, వైఖిలాల్ బకిలీవాల్, జయపూర్ సిటి, ఇంకను వేనకు వేలమంది కలరు.

వారితో సంప్రతించనిదే భవిష్యత్తును నమ్మకండి.


ఉత్తమ శైవమత గ్రంథము

## పండితారాధ్య చరిత్ర

పాల్కురికి సోమనాథకవి రచించిన ఉత్తమ ద్విపద కావ్యము. డా॥ చిలుకూరి నారాయణరావుగారిచే పరిష్కరింపబడినది. దీక్షా, పురాతన, వాద మహిమ, పర్వతములను అయిదు ప్రకరణములను ఒకే సంపుటమున గలవు. ఇంత నిర్దుష్టముగ ఈ గ్రంథము నిదివర కెవ్వరును ప్రచురించి యుండ లేదు. నారాయణరావుగారు రచించిన అమూల్యమైన పీఠిక కూడ కలదు. వెల రూ. 5-0-0

ప్యాకింగు, పోస్టేజి రూ 1-4-0.

**ఆంధ్రగ్రంథమాల పో. బా. 212, మద్రాసు**

రైస్ హల్లర్, పిండి మరలు, డిసిన్టెగ్రేటర్సు, పుల్లీ, పంపు, బెల్టింగులు, ఇతర మెషినరీ విడిభాగములకు

**శ్రీ రామకృష్ణ మిల్ స్టోర్సు,**

6-బి, ఎర్రబాలు చెట్టి వీధి,

మదరాసు జి. టి.



## నేతాజీ ఆమ్లా హెరాయిల్

వివా శిరోజములను

వృద్ధిచేసి నల్లపరచుటలో సాటిలేనిది. మెదడుకు చల్లదనము నిచ్చును. మాడుపోటును పోగొట్టును. వనమూలికలతో తయారు కాబడి ఆకర్షణీయ మగు సువాసన గల హెరాయిల్.

సీసా 1-కి రు 1-8-0. పోస్టేజి ప్రత్యేకము.

**శ్రీ కృష్ణా సోపు వర్క్సు, బెజవాడ.**


Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras

## చీరాల పరిసరాలలో బియ్యానికి కాటకం

### ఏదోవిధంగా బియ్యంతెచ్చుకోడానికి ప్రజల అగచాట్లు

చీరాల, సెప్టెంబరు 7: ఈపూరు రేషనింగు ప్రదేశమైనను బియ్యం పరిస్థితి చాలా అసంతృప్తికరముగా యున్నది. అధికారరీత్యా విచారించగా వారానికి ఈ రేషనింగు ఏరియాకు (అనగా చీరాల, పేరాల, జాండ్రపేట గ్రామములకు) 1080 బస్తాలు బియ్యం కావలసియున్నవి. గత వారంలో (అనగా నిన్నటితో పూర్తియైన వారమునకు) ఏరియాలో ఉన్న రేషన్ షాపులకు 920 బస్తాలే సప్లయి చేయబడెను. ఆ బియ్యం ఆరురోజులకు సరిపోయినవి. నిన్న బియ్యంలేవు. రేషన్ కార్డుగల ప్రజలందరు బియ్యంకోసం సంచులతో తిరుగుచున్నారు. రేషన్ షాపులచుట్టూ ప్రజలు గుమిగూడుచున్నారు. గత వారం తాలూకు తరుగుబాటు బాకీ 160 బస్తాలు, ముందు వారం తాలూకు 1080 బస్తాలూ వెంటనే రవాణాచేయుమని ఈపూరు రేషనింగు ఆఫీసరు జనాబ్ సయ్యద్ ఖాదర్ సాహెబు గారు గుంటూరుజిల్లా సప్లయి ఆఫీసరు గారికి నిన్న తంతివచ్చిరి.

గ్రామంలో విచారించగా వారానికి మూడురోజులగూడ బియ్యం దొరకడము లేదని తెలిసింది. అందువల్ల బీదలు ఆకలి బాధకు ఓర్వలేక అప్పికట్ల, మాచవరం, మోదుకూరు, పొన్నూరు గ్రామములకు ప్రతినిత్యము వెళ్లి దొంగమార్కెట్టులో బియ్యం కొని తెచ్చుకొనుచున్నారు. దొంగమార్కెట్టులలో బియ్యం తెచ్చుకొనుటకు కరవది స్టేషన్‌నుంచి ప్రజలు పిల్లలు, స్త్రీలు, పురుషులు వేలకువేలు వెళ్లుచున్నారు. కరవదినుంచి పై స్టేషన్లకు అన్ని రైళ్లు క్రిక్కిరిసి పోవుచున్నవి. రైలు పెట్టెలలో స్థలములేక మెట్లమీద, టాపుల మీద, కపిలింగ్సుమీద రైలుపెట్టెలక్రింద ఇనుప బారులమీద కూర్చొనుచున్నారు.

బియ్యం తెచ్చుకొను ఒక కార్మికుని బ్లాకుమార్కెట్టులో కొని ఇట్లు అక్రమముగా ఎందుకు తెచ్చుకొని అవస్థపడవలెనని నేను ప్రశ్నించగా "డిపోలలో బియ్యం యివ్వరు—నేను పిల్లలు మాడిపోవుచున్నాము. అవస్థపడలేక యిట్లా తెచ్చుకొనుచున్నాను" అని చెప్పెను. రేషను షాపులలో బియ్యం స్టాకు ఎందుకు ఉంచరు అని ఒక ఉద్యోగిని ప్రశ్నించితే రైతులు బ్లాకు మార్కెట్టులలో అమ్ముకొనడము మొదలు పెట్టడమువల్ల అధికారరీత్యా సేకరణ జరగడము లేదు. ప్రజా సహకారము రావడములేదు అని చెప్పినారు. ఒక రైతును అడిగితే మేము వ్యవసాయమునకు కావలసిన అన్ని వస్తువులు బ్లాక్ మార్కెట్టులో కొని, మాధాన్యం ప్రభుత్వ ఏజంట్లకు కంట్రోలు రేటుకు ఇవ్వలేము, అట్లా ఇస్తే పెళ్లాం మెళ్లో తాళిబొట్టు అమ్ముకోవలసినదె అని చెప్పినారు.

### ప్రభుత్వమునకు పట్టణ కాంగ్రెసు తంతి

రేషను షాపులలో బియ్యంలేవనీ ప్రజల అగచాట్లు తొలగించుటకు రేషనింగు వెంటనే తొలగించి బియ్యం యితర గ్రామాల నుండి ధారాళముగా తెచ్చుకొనడానికి ఉత్తరువులు వెంటనే సాదరు చేయమని ఆహారశాఖా మంత్రి రాజన్ గారిని, ప్రధానమంత్రిగారిని కోరుచూ నిన్న ఈ పట్టణకాంగ్రెసు అధ్యక్షు శ్రీ పప్పుపులు సుబ్రహ్మణ్యం శ్రేష్టిగారు టెలిగ్రాములు యిచ్చిరి.

### ప్రభుత్వ ఉద్యోగులకు సౌకర్యం

పోలీసుశాఖ మున్నగు ప్రభుత్వ అత్యవసరశాఖ ఉద్యోగులకు వారానికి సరిపోవు రేషను వారంలో ఒకేసారి ఇవ్వవలెనని ఈపూరు రేషనింగు ఆఫీసరుగారికి పై అధికారులనుంచి ఉత్తరువులు వచ్చినట్లు తెలియుచున్నది.

తత్ఫలితంగా ఈ పూరి రిటైలు రేషను డిపోదారులకు ఈ పూరి రేషనింగుఆఫీసరు జనాబ్ సయ్యద్ ఖాదరు సాహెబు గారు ఉత్తరువులు పంపిరి.

### ప్రభుత్వమునకు కమ్యూనిస్టు పార్టీ వారి తంతి

నిన్నటి రోజున మూడురోజులకు మాత్రమే రేషన్ ఇవ్వబడెను. బియ్యం ఎక్కడా లేవు. రైతులనుండి ధాన్య సేకరణ ధాన్యం స్వాధీనం మాచవరం, పొన్నూరు, మోదుకూరు ప్రాంతములలో జరిగి వెంటనే యిక్కడికి దిగుమతి చేయించవలెను. బియ్యం రేషనింగు తొలగించరాదు. తొలగించితే బియ్యం ధర పెరుగును. తత్ఫలితముగా (దొంగమార్కెట్టులో బియ్యం తెచ్చు అసంఖ్యాకులవలన) రైళ్లలో వత్తిడి యెక్కువగుటయేగాక తోటు జిల్లాలకు ఒక్క గింజకూడ దొరకదు అని ఈ పూరి కమ్యూనిస్టు పార్టీవారు ప్రధానమంత్రిగారికి, ఆహారశాఖామంత్రి గారికి మొన్న తంతివార్తలు పంపిరి.

### పరిసరగ్రామాలలో ధాన్యసేకరణ

ఈ పూరి డిప్యూటీ తహశిల్దారు శ్రీ కె. వెంకటరెడ్డిగారు యీ వారం గత వారంలో కొంతమంది, కుంకాయమ్రు మొదలైన గ్రామములకు వెళ్లి రైతులను అదనపు ధాన్యము యిమ్మని విజ్ఞప్తిచేసిరి. తత్ఫలితముగా వారు 1250 వడ్ల బస్తాలను సేకరించిరి.

మొన్న సాయంకాలము శ్రీ రెడ్డిగారు వేటపాలెంవద్ద ఒంగోలుకు వెళ్లుచున్న గోచి ప్యాసింజరు బండిని తనిఖీచేసి అక్రమముగా తీసుకొని వెళ్లుచున్న బియ్యం మూటలను పట్టుకొనిరి. పట్టుకొన్న మూటల బియ్యం 18 బస్తాలు అయినవి. ఆ 18 బస్తాలు వేటపాలెం రేషన్ డిపోలకు ఒప్పజెప్పిరి.

### బోటులో బియ్యం, ధాన్యం పట్టుబడుట

గతవారంలో బకింగ్‌హామ్ కాలువలో ఒకబోటును పంతరావూరులాకు వద్ద పంతరావూరు రివెన్యూ ఇన్‌స్పెక్టరు శ్రీ కె. రామయ్యనాయుడుగారు అనుమానము మీద పట్టుకొని సోదా చేసిరి. ఒక పూరకప్పుక్రింద 11 బస్తాల బియ్యం, 50 బస్తాల వడ్లు పట్టుకొనినట్లు ఈ పూరి డిప్యూటీ తహశిల్దారువారికి రిపోర్టు వచ్చెను. ఈ సంగతి నేడు అధికారరీత్యా తెలిసింది.

### రైలు ప్రయాణానికి ఆటంకం

గత గురువారం మధ్యాహ్నం గూడూరు నుంచి బెజవాడకు వెళ్లు ప్యాసింజరు వేటపాలెం చేరేసరికి జనసమ్మర్దము విపరీతముగా నుండెను. మాచవరంలో బియ్యం కొనుటకు అనేకవందలనుండి ప్రయాణము చేయుచుండి వేటపాలెం స్టేషనులో ఆ బండికి పోవుటకు బియ్యం కొనువారు సుమారు 5 వేల మంది వచ్చిరి. వారు ఎక్కుటకు స్థలము లేకపోయినది. అంతట వారందరు కొందరు రైలుపెట్టెల మెట్లమీద, కిడ్కీలు పట్టుకొని నిలుచుండిరి. కొందరు పైటాపులమీద కూర్చుండిరి. కొందరు బండికి బండికిమధ్యకపిలింగులమీద కూర్చుండిరి. కొందరు రైలుబండ్ల క్రింద చక్రములమధ్య యున్న ఇనుపకమ్ములమీద కూర్చున్నారు. ఎవరు వారించినను వినలేదు. అట్లా ప్రయాణించడం ప్రమాదమైనది. దిగి యింకొక బండికి రమ్మని గార్డు చెప్పెను. కాని ఎవరు వినలేదు. అందరు దిగనిదే రైలు బయలుదేర నివ్వనని గార్డు పట్టుబట్టినాడు. ఉభయులు పట్టు వీడలేదు. వేటపాలెం పోలీసువారి సహాయం కోరబడెను. అప్పుడు వేటపాలెం పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరుగారు చీరాల పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారికి రిపోర్టు పంపిరి. యిక్కడినుండి కొంత పోలీసు సిబ్బంది పంపబడెను.

చీరాల పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు వేటపాలెంలో పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు గార్లు పోలీసు సిబ్బందితో అక్రమముగా రైలుఎక్కిన ప్రజలను బయటికి వెళ్లగొట్టిరి. అప్పుడు రైలుకదిలెనది. అందువల్ల రైలు వేటపాలెంలో 3 గంటలు నిలిచిపోయినది.

ఇట్టి సంఘటనలు నివారించుటకు గాను పోలీసు అధికారులు గుంటూరునుంచి రిజర్వు పోలీసుదళమును తెప్పించి వేటపాలెంలో యుంచిరి. ఆ రైలు చీరాలకు రాగా యిక్కడ సుమారు 2 లేక మూడు వందలమంది ఎగబడిరి. స్టేషనుమాస్టరు సయ్యద్ నూర్ సాహెబుగారు తమ చాకచక్యముచే ప్రజలందరిని దింపి రైలును సాగనంపిరి. ఒకమనిషిని యింతటి ప్రాణాపాయ ప్రయాణమునకు ఎందుకు పాల్పడవలెను అని అడుగగా రేషనింగుషాపులలో బియ్యందొరకక కడుపులు మాడుతూ ఉంటె ఆఅపాయం లెఖలేదు అని చెప్పినాడు.

## పుదుచ్చేరినుండి 4 వేల కార్మిక కుటుంబాల వలస

కడలూరు, సెప్టెంబరు 8: పుదుచ్చేరిలో స్వాస్థ్యంలేక పోవడంవల్ల దాదాపు 4 వేల కార్మిక కుటుంబాలు ఫ్రెంచిఇండియా సరిహద్దులుదాటి దక్షిణ ఆర్కాటు జిల్లాలో ప్రవేశించినట్లు తెలుస్తున్నది. కార్మిక కుటుంబాల వలస ఇంకా సాగుతూనే ఉన్నదట. దక్షిణ ఆర్కాటుజిల్లా అధికారులు పరిస్థితిని శ్రద్ధతో గమనిస్తున్నారు.

## దేశభక్తుల సన్మానమహాసభ

గన్నవరం, సెప్టెంబరు 8: ఈతాలూకా కాంగ్రెసు సంఘ యాజమాన్యమున యీ తాలూకా దేశభక్తుల సన్మాన సభ నిన్న జరిగెను. సర్దార్ వేటా బాపయ్యగారు అధ్యక్షత వహించారు. రాజకీయ బాధితులకు అధ్యక్షులు పతకములు బహూకరించారు. భారతదేశ ఆర్థిక, నైతిక, రాజకీయ సమస్యలనుగురించి శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్య గారు ఉపన్యసించారు.

తదుపరి అయ్యదేవర కాళేశ్వరరావు గోపరాజు రామచంద్రరావు గార్లు ఉపన్యసించారు. తర్వాత ఉంగుటూరు నేతాజీ బుర్రకథ దళమువారిచే బుర్రకథ చెప్పబడెను.

## అమ్మకపు పన్ను హెచ్చింపు

### నూటికి ఇక రూపాయి తొమ్మిదణాల వసూలు

మదరాసు, సెప్టెంబరు 9: ఈ రోజు మధ్యాహ్నం రాష్ట్రమంత్రివర్గ ఇష్టాగోష్ఠి సమావేశం జరిగింది. అమ్మకపు పన్నును ఇకమీద ప్రతి నూరు రూపాయలకు రు 1-9-0 వంతున వసూలుచేయడానికి ఈ సమావేశంలో నిర్ణయించినట్లు తెలుస్తున్నది. ఇప్పటివరకూ నూటికి రూపాయవంతున మాత్రమే వసూలు చేస్తున్నారు.

వార్తాపత్రికలపై అమ్మకపు పన్నును ఏజెంట్లవద్ద గాక, పత్రికా కార్యాలయాల ద్వారానే ఇకమీద వసూలుచేయడానికి కూడా నిర్ణయించారని తెలుస్తున్నది. ఇప్పటివరకు ఉభయులవద్దనూ ఈ పన్నును వసూలుచేస్తున్నారు.


### సరిగా లేని లివర్ గురించి జాగ్రత్త!

చురుకుగా పనిచేయలేని లివర్‌వల్ల ఏర్పడ్డ రక్తమాలిన్యము, లివర్‌గుండా రక్తము ప్రవహించునపుడు ఏమండైనా ఎర్రని పరము లపై శీఘ్రగతిని, ప్రత్యక్షంగా పనిచేయు నపుడే నివారించబడుతుంది. లివర్జెన్ అమోఘంగా చేయునదే యిది- అందుచే డాక్టర్లు-లివర్జెన్, అన్ని లివర్ జబ్బులకు మంచిదని చెబుతారు.


## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే.

కొన్ని సెక్షనులపై చౌక మూడవక్లాస్ ఛార్జీలు రద్దుచేయుట.

పాకాల-ధర్మవరం-అనంతపురం,
బళ్లారి-రాయదుర్గం,
హోస్పేట - కొత్తూరు,
హోస్పేట - సామిహళ్ళి.

సెక్షనులపై ఏ రెండు స్టేషనులకు మధ్యనైనా మైలుకు 3 పైసల చొ॥న గల చౌక సింగిల్ ప్రయాణపు మూడవతరగతి ఛార్జీలు 1947 సం॥రం అక్టోబరు 1 వ తేది నుండి రద్దుచేసి తీసివేయబడి, ఇతర సెక్షనులపై ఉన్నట్టుగా మామూలు ఛార్జీలు యీ సెక్షనులపైగూడా అమలుపర్చబడును.





ఆటగాళ్లలో స్పష్టంగా కనుపించే ఆ అపరిమితోత్సాహమూ, శక్తీ, ప్రధానాంగములు సరిగా పనిచేయడంవల్ల కలిగే దృఢమైన ఆరోగ్యానికి సూచకములు. ఈ టన్నిటిలో ముఖ్యమైన అంగము లివరు. పైత్యరసంతో కలిసి యిది ఆహారం జీర్ణం అవడానికి తోడ్పడుతుంది. ఆ విధంగా రక్తానికి బలంచేకూర్చి శక్తినిస్తుంది. లివరు సోమరితనంగా వుండి సరిగా పనిచేయకుండా వున్నపుడు దానికి వైద్యులంతా ఏకగ్రీవంగా ఆమోదించిన ఆదర్శ కపాయమగు నివారకౌషధమూ, స్టెరన్సు బై-కొలేట్సు.



**BI-COLATES**
**STEARNS**

## భమిడిపాటి కామేశ్వరరావు రచనలు

11 సంపుటాలు సిద్ధముగా ఉన్నవి. ఒక్కొక్కటి ఒక్కొక్కరూపాయి ఇంకా ఇతఃపూర్వ నవలలు నాటకాలు కథలపుస్తకాలు చాలా ఉన్నవి. అన్ని బుక్ షాపులలో దొరుకును ☞ సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

*A quick remedy for* **FILARIA**

**ARSENO-TYPHOID**



బోద సంబంధమైన అన్ని జబ్బులకు పరీక్షింపబడి మంచి గుణముగల ఔషధమిది. అట్టి జబ్బులను తప్పక పోగొట్టి బాధను తగ్గించి జీవితసౌఖ్యమనుభవింపజేయును.

CALCUTTA CLINICAL RESEARCH ASSN. Ltd., 6, chowringhee Rd, Calcutta
Branch: SITABALDI, NAGPUR.

**బహిష్టు** ఎంతకాలమునుండి, ఏకారణము వల్ల ఆగిపోయినా రుతువై (గవర్నమెంటు రిజిస్టర్డు) 24 గంటలలో క్రమపరచునట్లు గ్యారంటీ ఇవ్వబడినది రు. 3/-వి. పి. అణాలు 0-12-0. సంతాన విగ్రహము "ఉదైని" నిరపాయమైనది. శాశ్వతము రు. 5/-తాత్కాలికము రు. 2/8/-
BHARATI OUSHADHALAYA, A. P. 126/2 Hazra Road, Calcutta 26.
మద్రాసు స్టాకిస్టులు: మిల్లర్ అండ్ మిల్లర్, 157 బ్రాడ్వే, మద్రాసు.

చిత్రకోట ఉబ్బసమునందు కొండమూలికలు (గవర్నమెంటు రిజిస్టర్డు) ఒక్కమోతాదు 30-9-47 తేది పౌర్ణమినాడు తీసుకొంటే పుబ్బసం నయమగును. ఉత్తరప్రత్యుత్తరములు ఇంగ్లీషులో జరుపవలెను.
SHRI CHITRAKUT DAMANASHAK AYURVEDIC SIDH SEWA ASHRAM, P.O. CHITRAKOT, (Banda) U. P.

**గనేరియా మిక్చర్**
సెగరోగములను గ్యారంటీగా కుదుర్చును
సీసా 1 కి రు 3-0-0
దుర్గా మెడికల్ హాల్, బెజవాడ


## మదరాసు గవర్నమెంటు

### ఎలక్ట్రిసిటి డిపార్టుమెంటు

క్రింద చూపబడిన పనులు నిర్వహించుటకుగాను, ఆయా విషయములకు ఎదురుగా నమోదు చేయబడిన తేదీలలో సాయంకాలము 3 గంటలలోగా దిగువ సంతకముదారుకు చేరునట్లుగ సీల్డు టెండర్లు కోరబడుచున్నవి. టెండరు ఫారంలు, క్వాంటిటీల షెడ్యూలు మాత్రము దిగువ ఆఫీసులలో లభించును.

(1) దిగువ సంతకముదారు.
(2) సూపరింటెండింగు ఇంజనీరు, ఆంధ్రా పవర్ సిస్టం, బెజవాడ.
(3) ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, టి. ఎల్. సి. డివిజన్, ఏలూరు.

| వరుస నెంబరు | పని వివరము | పని చేయవలసిన చోటు | బ్లాకులు | స్పెసిఫికేషను నెంబరు | ప్రతి టెండరు సెట్టుయొక్క ఖరీదు | మొత్తముల షెడ్యూలు | చేరవలసిన తేది |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | రూ. | రూ. | |
| 1. | (a) స్థలము, రోడ్లు, కాలిదారులు, కల్వర్టులు వగైరాలకు గ్రేడింగు చేయుట. | [illegible] | | C 325 | 20-0-0 | 8-0-0 | 27—9—47. |
| | (b) అసిస్టెంటు ఇంజనీరు క్వార్టర్లు. | | 1 | | | | |
| | (c) స్టోరులు. | | 1 | | | | |
| | (d) వాటర్ సప్లయి. | | | | | | |
| | (e) డ్రయినేజి. | | | | | | |
| | (f) 2 "E" టైపు క్వార్టర్లు. | | 3 | C. 285 | | | |
| | (g) 2 "F" టైపు. | | 6 | | | | |
| | (h) 2 "G" టైపు క్వార్టర్లు. | | 7 | | | | |
| | (i) డివిజనల్ ఎలక్ట్రికల్ ఇంజనీర్సు ఆఫీసు. | | 1 | | | | |
| | (j) గారేజి. | | 1 | | | | |
| 2. | 2 ఆయిల్ టాంకులు పట్టుటకు వీలైన ఆయిల్ హవుసు. | [illegible] | 1 | C. 352 | 3-8-0 | 1-8-0 | 27—9—47. |
| 3 | (a) స్థలము, రోడ్లు, కాలిదారులు, కల్వర్టులు వగైరాలకు గ్రేడింగు చేయుట. | [illegible] | | C. 337 | 10-0-0 | 2-0-0 | 27—9—47. |
| | (b) సింగిల్ "F" టైపు క్వార్టర్లు. | | 1 | | | | |
| | (c) 2 "G" టైపు క్వార్టర్సు. | | 1 | | | | |
| | (d) స్టోరు అండ్ టెలిఫోను. | | 1 | | | | |
| | (e) వాటర్ సప్లయి. | | | | | | |
| | (f) డ్రయినేజి. | | | | | | |

నిర్ణీతఫారములో, గడువు తేదిలోగా పంపని టెండర్లు గమనింపబడవు.

టెలిగ్రామ్సు: "DUDUMENGER" WALTAIR.

(సం.) పి. ఎం. వెంకప్ప,
సూపరింటెండింగు ఇంజనీరు,
మాచ్‌ఖండ్ హైడ్రో ఎలక్ట్రిక్ స్కీము, వాల్తేరు,